APPROVED BY THE TEXT BOOK COMMITTEE OF MADRAS, 19-11-29.

రామా

# ఆంధ్రవ్యాకరణసర్వస్వము

గ్రంథకర్తలు:

శ్రీ శేషాద్రి రమణ కవులు,

శతావధానులు.



రెండవకూర్పు.

రామా అండ్ కో.,

విద్యావిషయ ప్రచారకులు,

ఏలూరు.

పట్టాభిరామా ప్రెస్, ఏలూరు.

1930

 [వెల 0—10—0

# పీఠిక.

ఉన్నత పాఠశాలలందలి విద్యార్థిలోకమున కాంధ్ర భాషా ప్రాముఖ్యము నభివృద్ధియొనరింపుచు వ్యాకరణమునకు (సెలబస్సు) ప్రణాళికను నిర్ణయించియుండిరి. అద్దాని ననుసరించియే ఈ వ్యాకరణ సర్వస్వమును రచించితిమి.

పాఠశాలయందుఁ బండితోపాధ్యాయులు గొందఱు బాలవ్యాకరణమే బోధింపవలసియుండునని తలంచుచున్నారు. అందలి సూత్రము లభిప్రాయ గర్భితములై సర్వజనసులభములుగాక విద్యార్థులకు గొఱుకరాని కొయ్యలైయున్నవి. బోధకులు వాని గుప్తార్థములను వెల్లడించుపట్ల నెంతయో శ్రమ బడవలసియుండును. మొదటినుండియు వ్యాకరణమనిన నెంతయోభీతినందు విద్యార్థులపట్ల బోధకుల శ్రమ యడవిఁగాచిన వెన్నెలయగుచున్నదని మాయనుభవమునఁ దెలిసికొనియున్నారము. బలవంత మాఘస్నానముగాఁ గొన్ని సూత్రములు వల్లెవేయించినను చిలుకపలుకులు, అర్థశూన్యములు, అగమ్యగోచరములు, అనుభవదూరములునై యుపయోగ శూన్యములుగానున్నవి. విషయములు సులభగ్రాహ్యములై యనుభవైకవేద్యములై నాతికఠినములై యుంట యత్యంతావశ్యకమైయున్నవి.

నాల్గవఫారమునకు అలంకార ఛందోవిషయములుతగాక తక్కిన గ్రంథమంతయును, అయిదవ ఫారమునకు అలంకార భాగము తప్ప తక్కినదంతయును, ఆఱవఫారము (S. S. L. C.) నకు గ్రంథమంతయుఁ బూర్తిగను బోధింపఁదగియుండును.

ఉన్నతపాఠశాలలయందు మాకుఁ గలిగిన యనుభవము నీ గ్రంథరూపమున వెల్లడించితిమి. పండితోపాధ్యాయులిందు గల లోపములను దెలియఁజేసిన కృతజ్ఞతా వందనములతో గ్రహించి మున్ముందు ముద్రణమున సవరించికొనఁగలము.

గ్రంథముద్రణావసరమునఁ బ్రత్యక్షముననుండి ప్రూపు లను స్వయముగ సవరించికొనఁదలంచితిమి. కాని కారణాంతర ములచే నట్టి యవకాశమొదవినదికాదు. అందుచే నందందు తప్పులు బడినవి. పాఠకసౌలభ్యము కొఱకుఁ గొన్నిఁటిని శుద్ధ పత్రికయందు దెలిపియున్నారము. గ్రంథబాహుళ్యమునకు వెఱచి ప్రతి తప్పును దెలిపియుండలేదు. కావున నట్టిలోపము లను సవరించికొనఁ బ్రార్థించుచున్నారము.

ఈవ్యాకరణ సర్వస్వమును దమ రామాకంపెనీ ప్రచురణములయందుఁ జేర్చి అచిరకాలమున ముద్రించి ప్రకటించిన రామా కంపెనీ ప్రొప్రయిటరులగు మహారాజశ్రీ ఈదర వేంకయ్య పంతులువారి నభినందించుచున్నారము.

ఇట్లు విధేయులు

కంకిపాడు. 1-5-29

శ్రీ శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

# Outlines of Telugu Grammar.

I. Classification of Sounds.

II. Classification of words in general.

III. Rules of Sandhi.

IV. Typical declensions of Nouns, Pronouns, numericals and Aupavibhakthika words. (ఔపవిభక్తికములు)

V. Samasa or compounding of words.

VI. Verbs conjugation and various forms.

VII. Formation of abstract nouns from nouns and verbs. Thadhitham and krithantham forms. తద్ధితములు, కృదంతములు.)

VIII. Syntax and Analysis, Transformation of Sentences, Paragraph construction.

IX. Errors in Grammar and Syntax.

X. Prosody.

XI. Chief figures of Speech. Detailed Syllabus in Telugu Grammar.

---

౧

# విషయసూచిక.

---

---

## Telugu Grammar Syllabus from the latest Educational Syllabus of High School Forms.

క్రొత్తగా మార్పుఁజెందిన హైస్కూలు ఫారముల విద్యా విధానములోని

ఆంధ్ర భాషా విధానములు.

---

### I Classification of Sounds.

వర్ణసమామ్నాయము, వర్ణోత్పత్తిసాధనములు, పరుషసరళ ఘోషములను దంత్యతాలవ్యాది వర్ణభేదములు.

పదములందు ఆద్యక్షర నియమము.

కళలు, ద్రుతప్రకృతికములు.

సిద్ధసాధ్య బిందువులు, అనుస్వారభేదములు.

### II Classification of words in general.

తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య భేదములు.

ఏతద్భేద సూచక వర్ణములు.

తత్సమము లేర్పడు రీతి.

### III Rules of Sandhi.

సంధిసూత్రములు :—

**A.** సంస్కృతసంధి :-

1. సవర్ణదీర్ఘసంధి, 2. గుణసంధి, 3. వృద్ధిసంధి, 4. సకారాంత శబ్దసంధి, 5. హల్ సంధి

*N. B.* (కేవల పదవిభాగము మాత్రమే నేర్పవలసినది.)

**B.** తెనుఁగు సంధి:—

1 అచ్సంధి 2 ద్రుతప్రకృతికసంధి 3 ఆమ్రేడితసంధి 4 సమాససంధి.

య-ర-న-ప-లు గాద్యాగమసంధులు.

IV Typical declension of nouns, pronouns, numerals and Aupavibhaktika words.

1. నామవాచక, సర్వనామ, సంఖ్యావాచక, ఔపవిభక్తికములకు లింగవచన విభక్తిరూపములు.

2. విభక్త్యుపయోగములు

V Samasa or compounding of words.

1. సమాసస్వరూపములు :—సిద్ధసాధ్య భేదములు.

2. తత్పురుష, కర్మధారయ, బహువ్రీహి, ద్వంద్వద్విగుసమాసములు.

VI Verbs Conjugation and verbal forms.

1. సమాపకక్రియలు.

a. భూత భవిష్యద్వర్తమాన తద్ధర్మార్థక రూపములు.

b. ఆత్మనేపద, ప్రేరణ, ప్రార్థన, ఆశీరాద్యర్థక రూపములు.

2. అసమాపక క్రియలు :—భావార్థక, క్త్వార్థక, తుమున్నాద్యర్థక, చేదర్థక, అనంతర్యార్థక రూపములు.

(3) వ్యతిరేకరూపములు.

(4) విశేషణరూపములు.

(5) శబ్దపల్లవములు, తత్సమధాతువులు.

VII Formation of abstract nouns from nouns and verbs. కృత్తద్ధితరూపములు.

VIII Syntax, Analysis, Transformation of Sentences and Paragraph construction.

(1) కర్త్రర్థక, కర్మార్థక, ప్రయోగములు.

(2) వాక్యములను నిర్దిష్టప్రకారము మార్చుట.

(3) వ్యాసరచనలో విషయ విభాగము ననుసరించి వాక్యార్థ రచన. (Paragraphs) చేయుట.

(4) వ్యాసముల యుపక్రమోపసంహారక్రమము.

## IX Errors in Grammar and Syntax.

వాక్యసంయోగ లోపములు.

1. అద్యక్షరదోషములు, య. యి. యీ. యె. యే. వు. వూ. వో. వో. మొదలగునవి.

2. ద్రుతప్రకృతికములమీఁద యకారాగమ దోషములును, కళల మీఁద నకారాగమ దోషములును.

3. ద్విత్వహల్ సంయోగదోషములు:—ఉదా, పల్లము.

4. స్త్రీతాకార మిచ్చువట్లు ప్రాగ్నార్థక రూపమును వాడుట. ఉదా:—చేయుమనె ననుటకు చేయమనెను అని వాడుట.

5. పొగ్రర్థనార్థకము:—వర్ణము లోపింపఁజేయుట;

6. ఆత్మనే పదార్థమున కొనుట కకారమును, దానుపులోని యకార మునకు సుకారము వచ్చుటయు మొదలగు దోషములు;

ఉదా:—చేసుక, మోసుకొని, కలుపుకొని, తలఁచికొని.

7. క్త్వార్థక ఇకార సంధిదోషము.

8. ఉత్తమ పురుష సంధి దోషము.

ఉదా:—చేసితిన్ + అపుడు=చేసితపుడు.

9. వర్ణవ్యత్యాసములు:—

ఉదా:—శ, ష, స, ఱ, ద, ధ, లు వత్తక్షరము లున్న చోట వదలి పెట్టుట; లేనిచోట నుంచుట మొదలగునవి.

10. లింగవచన విరోధములు.

11. విశేషణ, విశేష్య విరోధములు.

12. అర్థములలోఁ బునరుక్తి.
13. ఔపవిభక్తికములను సామాన్య శబ్దములుగా వాడుట.

X. Prosody. Metrics in Prosody occurring in the detailed text.

ఛందస్సు, గణములు.

చంపకమాల, ఉత్పలమాల, మత్తేభము, శార్దూలము, కందము, సీసము, గీతము, ఆటవెలది.

XI. Chief figures of speech.

అలంకారములు.

ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, ఆక్షేపము, వ్యతిరేకము, సమాసోక్తి, తుల్యయోగిత, దృష్టాంతము, అర్థాంతరన్యాసము, శ్లేష, కావ్యలింగము.

---

## Reference Books.

నిఘంటులు.

1 శబ్దరత్నాకరము.

వ్యాకరణములు.

2 ఆంధ్రశబ్ద చింతామణి.

నన్నయభట్టు - తెనుఁగర్థములో.

3 బాల వ్యాకరణము.
4 వేంకయ్య వ్యాకరణము.
5 ప్రౌఢ వ్యాకరణము
6 వికృతి వివేకము.
7 ప్రాకృత చంద్రిక.
8. తత్సమ చంద్రిక.
9. ఆంధ్రశబ్దానుశాసనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

10. అక్షరతత్త్వము

పాడి వేంకటశాస్త్రిగారు.

11 వివేక దీపిక.

టి. రాజగోపాలరావుగారు.

12. విభక్తిచంద్రిక.

## Figures of Speech.

13. సాహిత్య చింతామణి.

శతావధాని శ్రీనివాసాచార్య.

14. ఆంధ్రచంద్రాలోకము.

15 ఆంధ్రకువలయానందము.

16. ఆంధ్రకావ్యాదర్శము.

17. కావ్యాలంకారసంగ్రహము.

భట్టుమూర్తి.

18. కావ్యాలంకారచూడామణి.

## Prosody.

19. సులక్షణసారము.

20. అప్పకవీయము.

21. భీమనఛందస్సు.

22. అనంతునిఛందము.

23. ఛందశ్శాస్త్రము.

టి. రాజగోపాలరావుగారు.

## General

24. పురాణనామచంద్రిక.

25. పూర్వగాథాలహరి.

26. ఉపయుక్తపత్రికాశిక.

## History of literature.

27. ఆంధ్రకవులచరిత్ర.

మూఁడుభాగములు. (వీరేశలింగకవి కృతము)

28. కవి జీవితములు.

గురుజాడ రామమూర్తి గారు.

29. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర.

వంగూరి సుబ్బారావుగారు.

30. ఆంధ్రశతక కవులచరిత్ర.

వంగూరి సుబ్బారావుగారు.

## History of Telugu Literature.

31. History of Telugu Literature.
32. History of Mr. T. Rajagopala Row.
33. Do. Do. M. R. Kavi.





# రామా
# ఆంధ్రవ్యాకరణసర్వస్వము.

## 1. ధ్వనివిభాగము.

## CLASSIFICATION OF SOUNDS.

(1) వర్ణసమామ్నాయము. Alphabet.

అక్షరములు:— భాషయందుఁగల వివిధములగు ధ్వనులను
Letters. వ్రాఁతయం దుపయోగించుకొననైన గుర్తులకు అక్షరములు లేక వర్ణములు అని పేరు. ఇవి (1) అచ్చులు (2) హల్లులు (3) ఉభయములు అని మూఁడు విధములు.

(1) అచ్చులు:— ఇవి పదియాఱు. ఇతరవర్ణ సహాయములేక
Vowels. యుచ్చరింపఁబడును. (వీనికి స్వరములు, ప్రాణములు అని మాఱుపేళ్ళు గలవు.)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

Short Vowels. వీనిలో 1. అ. ఇ. ఉ. ఋ. ఌ. ఎ. ఒ అను నేడును హ్రస్వములు.

Long Vowels. 2. ఆ. ఈ. ఊ. ౠ. ౡ. ఏ. ఐ. ఓ. ఔ. అను తొమ్మిది దీర్ఘములు.

3. ఎ. ఏ. ఒ. ఓ. అను నాలుగు వక్రములు.

4. ఐ. ఔ. అను రెండు వక్రతమములు.

(2) హల్లులు :—ముప్పదియేడు. అచ్చుల సహాయముచే హల్లులు (Consonants) నుచ్చరింపఁబడును.

(వీనికి వ్యంజనములు, ప్రాణులు అని మాఱుపేళ్లు గలవు.)

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ఱ ళ

(2) Hard Consonants. వీనిలో:—

1. క. చ. ౘ. ట. త. ప. అనునాఱును పరుషములు.

2. ఖ. ఛ. ఠ. థ. ఫ. అను నైదునువర్గయుక్పరుషములు.

3. Soft Consonants. గ. జ. ౙ. డ. ద. బ. అను నాఱునుసరళములు.

4. ఘ. ఝ ఢ.ధ.భ అను నైదునువర్గయుక్సరళములు.

5 ఙ ఞ ణ న మ అను నైదును అనునాశికములు.

6 క ఖ గ ఘ ఙ అనునవి కవర్గము.

7 చ ఛ జ ఝ ఞ " చవర్గము.

8 ట ఠ డ ఢ ణ " టవర్గము.

9 త థ ద ధ న " తవర్గము.

10 ప ఫ బ భ మ అనునవి పవర్గము.

11 ఈ యైదు వర్గములును స్పర్శములనఁబడును.

12 య ర ల వ లు అంతస్థములు.

13 శ ష స హ లు ఊష్మములు.

(3) ఉభయాక్షరములు మూఁడు ఁ ం ః.

## (2) ఉత్పత్తిస్థానములు (Sound Origin)

| | | |
|---|---|---|
| 1 అ ఆ క ఖ గ ఘ ఙ హ ః. | కంఠ్యములు | (Gutturals) |
| 2 ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ | తాలవ్యములు | (Palatals) |
| 3 ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష | మూర్ధన్యములు | (Linguals) |
| 4 ఌ ౡ త థ ద ధ న ల స | దంత్యములు | (Dentals) |
| 5 ఉ ఊ ప ఫ బ భ మ | ఓష్ఠ్యములు | (Labials) |
| 6 ఙ ఞ ణ న మ ం | అను నాశికములు | (Nasals) |
| 7 ఎ ఏ ఐ | కంఠ్యతాలవ్యములు | |
| 8 ఒ ఓ ఔ | కంఠోష్ఠ్యములు | |
| 9 వ | దంతోష్ఠ్యము. | |

## (3) తాలవ్యములు. (Palatals.)

ఇ ఈ ఎ ఏ ల గూడిన చ, జలు తాలవ్యములు

ఉదా:—చిలుక, చీమ, చెవి, చేను, జిల, జీడి, జెట్టి, జేజె,

## (4) దంత్యములు—Dentals.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లంగూడిన చ జ లు దన్త్యములు.

ఉదా:— చలి, చాప, చుక్క, చూపు, చొక్క, చోటు, చౌకము, జముడు, జాతర, జున్ను, జూలు, జొన్న, జోలి, జౌకు.

(5) లఘ్వలఘువులు — Light and Harsh Semi vowels.

13. య ర ల వ అనునవి 1 లఘువు 2 అలఘువు అని రెండు విధములు.

1 సాధ్యమగు యకారము లఘువు. ఉదా:—అది + ఇట్టి అది యిట్టి.

2 సిద్ధమగు యకారము అలఘువు— ఉదా:—కాయ.

1 రేఫము లఘువు—ఉదా:—పెరుగు.

2 శకటరేఫము అలఘువు — ఉదా:—చెఱకు.

1 సిద్ధమగు లకారము లఘువు-ఉదా—తల.

2 సాధ్యమగు ళకారము అలఘువు—ఉదా:(ఏఱు)ఏళులు

1 సాధ్యమగు ప్రథమమీఁదివకారములఘువు. ఉదా:— అతఁడు పలికె = అతఁడు వలికె.

2 సిద్ధమగువకారము అలఘువు—ఉదా:—వాఁగు.

(6) ఆద్యక్షర నియమము.

14. ఙ య ళ వు వూ వొ వో అను నక్షరములు దెనుఁగు మాటలకు ముందుండవు.

15. నకారపొల్లునకు ద్రుతము అని పేరు. ఇది నికారముగను, నుకారముగను మాఱుచుండును.

16. తెనుఁగు శబ్దములన్నియు 1. కళలు 2. ద్రుతప్రకృతికములు అని రెండు విధములు.

(7) కళలు.

కళలు :— ద్రుతము అంతమందులేని పదములు కళలు.

1 విభక్తులలో డు ము. వు. లు. కూర్చి. కై. పట్టియొక్క సంబోధనములు.

2. సమాపక క్రియలలో ప్రథమ, ఉత్తమ పురుషల బహు వచనములు, మధ్యమ పురుషమున ఏకవచన బహు వచనములు, భూతార్థక బహువచనము.

3. అసమాపక క్రియలలో క్త్వార్థకములు.

4. అర్థకములు. కళలు.

ఉదా:—

1. విభక్తులు:—రాముఁడు, వనము, ధేనువు, రాములు, రాముఁగూర్చి, రామునకై, జ్ఞానముఁబట్టి, జ్ఞానము యొక్క, రాముఁడా, రాములారా.

2. సమాపక క్రియలు:—వచ్చిరి, వచ్చితిమి, వచ్చితివి, వచ్చితిరి, వచ్చిరి.

3. అసమాపక క్రియలు:—వచ్చి, రాక, చేసి, చేయక

4. అర్థకములు:—

1 కించిదర్థకము:—ఇంచుక—కొంచెము.

2 ప్రశంసార్థకము:—అయ్యారే, బళి

3 ఆశ్చర్యార్థకము:—ఔరా—ఆహా.

4 సంతాపార్థకము:—అకటా—కట్టా.

5 యదార్థకము:—ఎప్పుడు.

6 తదార్థకము:—అప్పుడు.

7 సంప్రత్యర్థకము:—ఇప్పుడు.

8 ఆశీరాద్యర్థకము:—కాక.

9 కిమర్థకము:—ఏమి, ఏది.

10 ఏవార్థకము లేక అవధారణార్థకము:-అ.ఎ.ఏ.

11 భావార్థకము:—వచ్చుట.

12 ప్రశ్నార్థకము:—ఏల. ఏలా.

13 తూష్ణీమర్థకము:—ఊరక, మిన్నక.

14 కిలార్థకము—కద, కదా.

(8) ద్రుతప్రకృతికములు.

ద్రుతప్రకృతికములు. ద్రుతము అంతమందుఁగల పదములు ద్రుతప్రకృతికములు.

1 విభక్తులలో డు—ము—వు—లు—కూర్చి—కై—పట్టి యొక్క—సంబోధన ప్రత్యయములు గాక తక్కిన ప్రత్యయములును,

2. ఏను, నేను, తాను పదములును,

3. ఉత్తమపురుష ఏకవచనములును,

4. భూత, తదర్థార్థకాద్యర్థక ప్రథమపురుష ఏకవచనములును,

5. శత్రు, తుమున్న, అనంతర్య, చేదాద్యర్థకములును, ఆశీరాద్యర్థక ఎ. డు. త వర్ణకంబులును,

6. సముచ్చయార్థకములైన "యు, ను" లును,

7. ఎల్లాదులును ద్రుత ప్రకృతికములు.

ఉదా:—I విభక్తులలో:—నిన్. నున్, లన్. చేతన్. చేన్. తోడన్, తోన్.

కొఱకున్, వలనన్, కంటెన్, కిన్ కున్, లోన్, లోపలన్, అందున్.

ఇందున్, నన్.

2. తాన్, ఏన్, నేన్.

3. ఉత్తమపురుష వచ్చితిని.

4. వచ్చెను, వచ్చెడున్, చేసెడిన్, వచ్చున్.

5. శత్రు:—వచ్చుచున్. తుమున్న:—రాన్.

అనంత:—నావుడున్. ఆశీ:—ఎడున్, తన్.

6. ఎల్లన్, ఇంకన్, ఇంగన్, కనుకన్, తప్పన్, వలెన్, మొ.

7. యున్, నున్.

(9) అ ను స్వా ర భే ద ము లు. The Nasal Character.

బిందువు:— I పూర్ణబిందువు 2 ఖండబిందువు అని రెండు విధములు.

పూర్ణ, ఖండబిందువులు. 1 సిద్ధములు 2 సాధ్యములు అని రెండు విధములు.

1. సిద్ధము అనఁగా శబ్దముతోడనే పుట్టినది. ఉదా:— చెండు, పండు, కాఁక, వీఁక

2. సాధ్యము అనఁగా వ్యాకరణముచే వచ్చినది. ఉదా:— చెన్ను + తోవ = చెందోవ—వచ్చె + కమలాక్షుఁడు = వచ్చెఁగమలాక్షుఁడు.

బిందువు తెనుఁగుమాటలయందు పరుష సరళములకు ముందుండును.

Nasal Character continued.

1 ఖండబిందువు: —పురుషునిబోధించు పదాంతమందలి 'డు'వర్ణమునకు ముందునుఉదా:— రాముఁడు, వచ్చినాఁడు.

2. పరిమాణమును దెల్పు 'ఎడు' వర్ణకమందును. ఉదా:-గోనెఁడు, గరిటెఁడు.

3. మధ్యమపురుషబహువచనమునవచ్చు 'డు' వర్ణమునకు ముందును. ఉదా:—చూడుఁడు, చేయుఁడు.

4. స్త్రీలింగార్థమును సూచించు 'ఆఁడి' వర్ణముల మధ్యను ఉదా:—వగలాఁడి, వన్నెలాఁడి.

5. యకారాంతధాతువుల కృదంతరూపములందలి 'త' వర్ణకమునకు ముందును, ఉదా:— కోయు, కోఁత; మూయు, మూఁత.

6. దీర్ఘాక్షరమునకు ముందుఁగల 'ము' వర్ణకమునకు ఔపవిభక్తికమైన 'ప' వర్ణ మాదేశమైనపుడు దానికి ముందును ఉదా:—నాము, నాఁప, వేము, వేఁప.

7. 'ను' వర్ణము కడపటఁ గల విశేష్యములకు రూపాంతరముగాఁ వచ్చిన 'కు, గు' అను వర్ణకములకుముందును-ఉదా:—కలను, కలఁకు, రేను, రేఁగు.

8. లేమిడిని తెల్పు 'ఇఁడి' ప్రత్యయములోని డి అను వర్ణమునకు ముందును. ఉదా:— మ్రొక్కఁడి, లేమిఁడి. అరసున్న లుండును.

1. హ్రస్వము మీఁది ఖండబిందువు పూర్ణబిందువగును. ఉదా:—కలఁగి, కలంగి; తొలఁగి, తొలంగి.

2. దీర్ఘముమీఁది ఖండబిందువు పూర్ణబిందువు కాదు. ఉదా:—వాఁడు, నేఁ జదివితి.

సిద్ధఖండము (నైజముగా పదములో నరసున్నగల పదములు.)

| | | |
|---|---|---|
| అఁట | గోఁగు | తాఁగ |
| అణఁగు | కాఁగు | లాఁతి |
| అనఁటి | కాఁపు | వాఁడి |
| అనపుఁడు | చీఁకటి | వాఁపు |
| అనుఁగు | చేఁదు | సాఁకు |

| | | |
|---|---|---|
| ఇఁక | తలఁకు | సోఁకు |
| ఈఁటె | తేఁట | సోఁగ |
| ఈఁగ | త్రేఁపు | వేఁగు |
| ఊఁక | తోఁట | వెలఁగ |
| ఊఁచ | నాఁగలి | మూఁడు |
| ఊఁదుట | ప్రాఁత | వెడఁద |
| ఏఁడు | మడఁగు | వేఁట |
| ఏఁపు | మూఁగు | వేఁడి |

సంస్కృత శబ్దములను గుర్తించు విధములు :—

1. సంస్కృత సంధులు గల సిద్ధసమాసములోనిశబ్దములు. ఉదా :— అస్మత్ + మతము = అస్మన్మతము, ముర + అరి = మురారి.

2. తెనుఁగు వర్ణములలో లేని యక్షరములుగలశబ్దములు. ఉదా:—కృష్ణసుతుఁడు, భక్తి, శ్లేష.

3. ప్ర. పరా. అప. సమ్. ని. అవ. నిస్. దుర్. వి. అధి. సు. ఉత్. పరి. ప్రతి. అభి. ఉప. అపి. ఆఙ్. అతి. అనువాని కుపసర్గలు (ప్రాదులు) అని పేరు. ఇవి మొదట నిల్చిసమస్లించినశబ్దములు సంస్కృతము లే యగును. ఉదా:—ప్రచారము, ఉత్తరము, అపరిమితము, పరాక్రమము, సమ్మతము మొదలైనవి.

4. సంయుక్తము (ఒకహల్లుక్రింద మఱియొక హల్లుండుట) లు గల పదములు. ఉదా:—తీవ్రము, శౌర్యము, ఆప్తుఁడు, ఆర్ద్రము, మత్సరము.

5. స్థిరాక్షరములకు ముందు పూర్ణానుస్వారగలపదములు. ఉదా:—వందనము, ఖండము, భంగము మొదలైనవి.

---

## 2. సాధారణ శబ్దవిభాగము.

### Classification of words in general.

శబ్దవిభాగము. Parts of speech.

ఆంధ్రభాష 1 తత్సమము 2 తద్భవము 3 దేశ్యము 4 గ్రామ్యము అని నాలుగు విధములు.

1 తత్సమములు.

1. తత్సమము సంస్కృత శబ్దముతోడను, ప్రాకృత శబ్దము తోడను సమానమైన రూపముఁగలది. ఉదా:— రామః=రాముఁడు, ధేనుః= ధేనువు.

2. సంస్కృత ప్రాకృత శబ్దముల కడపటనుండు విసర్గమును గాని పొల్లునుగాని దీర్ఘమునుగాని తొలఁగించివేసి వలసిన చోట డు, ము, వు ప్రత్యయములు చేర్చిన తత్సమము లగును.

3. తత్సమశబ్దములను దెలిసికొనువిధములు.

1. సంస్కృతమునుండి తెనుఁగులేని ఋ, ౠ, ఌ. ౡ, ః, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష యక్షరములు గల శబ్దములును.

2. య, ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ అను నక్షరములు

మొదట గల శబ్దములును, ఉ:—యతి, వోడ, చైత్రము, జైత్రుఁడు.

3. అనుస్వారమునకుఁ బ్రక్కఁ బరుష సరళములు గాక తక్కిన యక్షరములు గల శబ్దములు. ఉదా:— శృంఖలము.

4. రేఫేతరహల్లుతో సంయుక్తమైన యక్షరము మొదటఁ గల శబ్దములును. ఉదా:—స్యందనము.

5. రెండింటికి మించిన హల్లులు సంయుక్తములైన శబ్దములును. ఉదా:—మత్స్యము— నిర్వ్యాపారము.

తత్సమములకుఁ గొన్ని యుదాహరణములు.

| సంస్కృతము | ప్రాకృతము | తత్సమము. |
|---|---|---|
| హరిః | | హరి |
| గౌః | | గోవు |
| పితా | | పిత |
| అగ్నిః | అగ్గి | అగ్గి |
| కటుః | కారో | కారము |
| యమః | జమో | జముఁడు |
| శృంగారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| రాజ్ఞీ | రాణీ | రాణి |

| | | |
|---|---|---|
| సవితృ | సవిత (రూ) | సవితృఁడు |
| మూర్ఖ | మూర్ఖుఁడు (రూ) | మూర్ఖు |

లును, ఉదా :—మత్స్యము, నిర్వ్యాపారము.

(2) తద్భవము:—సంస్కృత ప్రాకృత శబ్దములవలన బుట్టినవి. సంస్కృత శబ్దమునందును, ప్రాకృత శబ్దమునందును, గల యక్షరములు విడుచుటచే నైనను (వర్ణలోపము) క్రొత్తయక్షరము లెక్కువగఁ జేర్చుట (వర్ణాగమము) చేనైనను, అక్షరములు ముందు వెనుక మార్చుట (వర్ణవ్యత్యము) చేనైనను యేర్పడునవి.

ఉదా:—వర్ణలోపము ఉదా:—భోజనమ్=బోనము,జయ = జే, వర్ణాగమము. ఉదా:—రథః = అరదము, దేవః = దేవర, వర్ణవ్యత్యయము. ఉదా:—శుచిః = చిచ్చు,కక్షః = చంక. తద్భవములకుఁ గొన్ని యుదాహరణములు.

| సంస్కృతము. | ప్రాకృతము. | తద్భవము. |
|---|---|---|
| సముద్రః | | సంద్రము |
| చంద్రః | | చందురుఁడు |
| సూచీ | | సూది |
| స్మరః | | మరుఁడు |
| హరితాళము | | హరిదళము |
| అంగారః | ఇంగాలో | ఇంగలము |

| | | |
|---|---|---|
| ఆశ్చర్యమ్ | అచ్చేరం | అచ్చెరువు |
| ప్రయాణమ్ | ప్రయాణం | పయనము |
| ప్రవాళః | ప్రవాళో | పవడము-పగడము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| విష్ణుః | విణ్ణూ | వెన్నుఁడు |
| స్థూలమ్ | థోరం | తోరము |
| వైద్యః | వెజ్జో | వెజ్జు |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| పృథివీ | పుథవీ | పుడమి |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |

(3) దేశ్యము:—దేశమున వ్యవహరింపఁబడు శబ్దములు దేశ్యము లనఁబడును.

ఇవి 1 ఆంధ్రదేశ్యము 2 అన్యదేశ్యము అని రెండు విధములు.

1 ఆంధ్రదేశ్యము:—ఆంధ్రదేశమునందు మాత్రమే వాడఁబడు శబ్దములు. ఉదా:—తల్లి, తండ్రి, కూర, కాయ.

2 అన్యదేశ్యము:—ఆంధ్రమున వాడుకబడిన యితర భాషా శబ్దములు. ఉదా:—రవర, రీవి.

(4) గ్రామ్యము:—గ్రామములలోని (పామర) జనులు వాడుకొను శబ్దములు గ్రామ్యములనఁబడును.

ఇవి 1 నింద్య గ్రామ్యము 2 అనింద్య గ్రామ్యము అని రెండు విధములు.

1 నింద్య గ్రామ్యము:—వ్యాకరణమునకు విరుద్ధమైన శబ్దములు.
ఉదా:—మావూరికి నీ వెపుడొచ్చావు.
2 అనింద్య గ్రామ్యము:—మహాకవులచే గ్రంథములలో వాడఁబడిన శబ్దములు.
ఉదా:—కఱకంఠుఁడు, జీవగఱ్ఱ

తత్సమము లేర్పడురీతి.

1. అకారాంత పుంలింగ శబ్దములకు తత్సమము లగునపుడు బిందుపూర్వక (ండు) వర్ణకమముగును.
ఉదా:— రామః తత్స:—రాముఁడు: కృష్ణ, కృష్ణుఁడు.
(డువర్ణముపరంబగునపుడు పదాంతమందలి అకారము ఉకారమగును.)
2. నీచాదులకు బిందపూర్వక డు వర్ణము వైకల్పికముగ నగును.
ఉదా:—నీచు, నీచుఁడు. మూర్ఖు, మూర్ఖుఁడు. వృద్ధు, వృద్ధుఁడు. గృహస్థు, గృహస్థుఁడు. చార్వాకు, చార్వాకుఁడు.
3. భట్టాది శబ్దములకు బిందుపూర్వక డు వర్ణము రాదు.
ఉ:—అన్నంభట్టు, నారాయణభట్టు, నన్నయభట్టు.
4. అకారాదులైన నపుంసకములు తత్సమము లగునపుడు ము వర్ణముచేర్పఁబడును. (పుంలింగమువలె వాఁడబడినబిందుపూర్వక డు వర్ణమును పొందును.)
ఉదా:— మేఘము, మేఘుఁడు. సముద్రము, సముద్రుఁడు.

5. కుశాదులకు ముువర్ణమురాదు. (కుశ, దర్భ, కోట యివి కుశాదులు.)

6. చరిత్రాదులకు ముువర్ణలోపము విభాషనగును.

ఉదా:—చరిత్రి: చరిత్రము. అభిలాష:అభిలాషము.

(చరిత్ర, అభిలాష, అక్షత, అలక, ఆరాధన, ఆవాహన, అర్పణ, ఈక్షణ, ఆలోచన, గర్జన, గర్వ, ఘోష, చామర, చిహ్న, చరణ, తోరణ, తరంగ, నటన, పారణ, ప్రార్థన, ప్రయోగ, ప్రశ్న, బోధ, భ్రమ, లాలన, రంజన, వత్స, వధ, విమర్శన, విజృంభణ, వర్తన, సారణ, సంబోధన, స్ఫురణ, హంస, సర్గ, పాత్ర, శ్లేష మొదలైనవి.

7. దూతాదులు పురుషవాచకంబులైనయెడఁ బుంలింగరూపంబును స్త్రీసమరూపంబును తదితరంబగునెడ స్త్రీసమరూపంబును పొందును. ఉదా:—దూతదూతుఁడు, యోధయోధుఁడు, శుంఠుఁడు.

8. మిత్రాదులు పురుషవాచకములైన పుంలింగ నపుంసకలింగరూపముల నొందును. అట్లుకానిచో నపుంసకలింగములవలెనుండును. ఉదా:—మిత్రము, మిత్రుఁడు. శరణము, శరణుఁడు.

(మిత్ర, శరణ, పరిధాన, పాత్రి, కేవల, సామాన్య మొదలైనవి మిత్రాదులు)

9. ఒడ్డీఁడు, కత్తళుఁడు, కోటఁడు, బసవఁడు, ఈనాల్గును

రకములు గాకున్నను తదూపమును పొందెను ము రాదు.

కు ప్రథమైకవచన ప్రత్యయములు వు. ఉదా:—హరిః, హరి; మతిః, మతి; అరిః, అరి; ఖనిః, ఖని.

11. ఉకారాంతములకు వువర్ణముచేరి తత్సమము లగును.

ఉదా:—గురుః, గురువు; విష్ణుః, విష్ణువు; శంభుః, శంభువు; ధేనుః, ధేనువు; మనుః, మనువు; కటుః, కటువు; తరుః, తరువు; మొదలైనవి.

12. మను శబ్దమునకుఁ దక్క నుకారాంత మహద్వాచక శబ్దంబులకు బిందుపూర్వక డువర్ణముకూడ వచ్చును.

ఉదా:—గురువు, గురుఁడు; శంభువు, శంభుఁడు; విష్ణువు, విష్ణుఁడు; జరత్కారువు, జరత్కారుఁడు; మధువు, మధుఁడు, మొదలగునవి.

13. ధర్మాదులకు వువర్ణకంబగును. అట్టిచోఁ బదాంత మందలి అకార ముకారమగును.

ఉదా:—ధర్మము, ధర్మువు; అర్ఘము, అర్ఘువు; హితము, హితవు; వర్గము, వర్గువు.

14. ఋకారాంతములు, అకారాంతములు స్త్రీసమములగును.

ఉదా:—పితృ, పిత. మాతృ, మాత.

(పిత. మాత. స్వస. సప్త. హోతా. నేత. ఉద్గాత. భ్రాత. జామాత.భర్త.హర్త.గంత.హంత. నియంత మొదలైనవి.)

15. పుంలింగములగు విధాత్రాదులకు బిందుపూర్వక డు వర్ణము వచ్చును.

ఉదా:—విధాత, విధాతృండు. ధాత, ధాతృండు. సవిత, సవితృండు. నేత, నేత్రుండు మొదలైనవి.

16. దీర్ఘాంతములు తత్సములగునెడ హ్రస్వాంతములగును.

ఉదా:—సీతా,సీత,రమా, రమ, గౌరీ, గౌరి, ద్రౌపదీ,ద్రౌపది,జానకీ,జానకి,క్షమా,క్షమ, అచలా, అచలమొదలైనవి.

17. స్త్రీ వాచకములు ప్రథమైకవచన ప్రత్యయములనుపొందవు.

18. ఉకార ఊకార ఓకారాంతములు వు వర్ణము పొందును

ఉదా:—ధేనుః; ధేనువు; వధూః, వధువు; గోః, గోవు; భ్రూః, భ్రువు; మొదలైనవి.

19. ఏకాక్షరములగు పదముల దీర్ఘమునకు హ్రస్వము రాదు.

ఉదా:—శ్రీ—శ్రీ, మా, స్త్రీ-స్త్రీ, ధీ.

20. సంస్కృతసమాసమున సురాసుర శబ్దములు నిత్యబహువచనములు.

ఉదా :—సకలసురులు-సర్వాసురులు.

వ్యస్తపదము నేకవచనమునైన జనశబ్దమునపుంసకలింగము.

ఉదా:—జనము, ఏజనుండు (సమాసము) జనులు బహువచనము.

21. ప్రభవాది సంవత్సరముల పేర్లు స్త్రీలింగములు.

ఉ: ప్రభవ, విభవ, శుక్ల—మొదలైనవి.

22. కంధరాదులకు మువర్ణము బహుళముగ నగును.

ఉదా:—కంధర, కంధరము.

అర్చన, కంధర, కల్పన, ఉల్క, కల్పన, ఘట్టన, గ్రీవ సంభావన, పాలన, సార్సిక, పాదుక, భిక్షు, దంష్ట్రి మాయ, మిష మొదలైనవి.

## హ ల ం త ము లు.

23. స్వశబము ద్వితీయైక వచనాంతసమము. ఉదా:—శ్వానమ్

24. హలంతశబ్దముల తుది హల్లునకు ద్విత్వంబును ఉకారాగమము నగును.

ఉదా:—దిక్ = దిక్కు; రాట్ = రాట్టు, మరుత్ = మరుత్తు మొదలైనవి.

25. దీర్ఘముమీఁది హల్లునకు ద్విత్వము బహుళముగ నగును.

ఉ:—వాక్ = వాక్కు, వాకు; స్వరాట్, స్వరాట్టు = స్వరాటు.

26. మతుబాదికముల నామము ద్వితీయైక వచనాంతతుల్యము, శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్ ఉపానహమ్, అప్సరసమ్, మొదలైనవి మతుబాదికములు.

ఉ:—ముదము—ఉపానహము, స్రజము.

27. ఋత్విగ్గణమునకు బ్రథమా, ద్వితీయైక వచనాంతంబులు. ప్రాతిపదికములు.

ఉదా:—ఋత్విక్, ఋత్విక్కులు, ఋత్విజుఁడు.

(ఋత్విక్, వణిక్, నీవృత్, మరుత్, పరిక్షిత్, భూభుక్,

ఇంద్రజిత్, సత్రాజిత్, విశ్వజిత్ భోగభాక్, ఇవి ఋత్విగ్గ
ణములు.)

ఉ:—విశ్వకర్మా, విశ్వకర్మ, అశ్వద్ధామా, అశ్వద్ధామ;
యువా, యువ.

28. విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగును.

29. పుంలింగమై మహద్వాచకమైన బ్రహ్మశబ్దము స్త్రీ
సమము. (బ్రహ్మ అను శబ్దమునకు చతుర్ముఖుఁడు,
ఋత్విక్కు, విప్రుఁడు, తపము, వేదము, యోగము, అను
నర్థములు గలవు.)

ఉదా:—పుంలింగమైన బ్రహ్మ. నపుంసకమైన బ్రహ్మము.

30. ఆత్మేమ నిజంతములకును నకారాంత మనుష్యశబ్దము
లకును స్త్రీత్వము బహుళముగ నగును.

ఉదా:—ఆత్మా, ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు. అణిమ, అణిమము.
మహిమ, మహిమము. గరిమ, గరిమము. లఘిమ, లఘిమము.
దేవశర్మ, దేవశర్ముఁడు.

31. పయః ప్రభృతుల సకారమునకు ఉకారాగమమును.
ద్విత్వమును నిత్యముగ వచ్చును.

ఉదా:—పయః, పయస్సు. సరః, సరస్సు.

పయస్సు. సరస్సు. అంభస్సు. అంహస్సు. మేదస్సు. ఎనస్సు.
ఆయస్సు. ఆహస్సు. వర్చస్సు. మొదలైనవి.

32. మనఃప్రభృతుల సకారమునకు ద్విత్వము విభాషనగును.

ఉదా:—మనః, మనస్సు, మనసు. శిరస్సు, శిరసు. సదస్సు సదసు, మొదలైనవి.

33. యశః ప్రభృతుల అంత్యసకారమునకులోపము వైకల్పికము.

ఉదా:—యశస్సు, యశము.

యశస్సు, తేజస్సు, సదస్సు ఉరస్సు, వక్షస్సు, ఛందస్సు అర్చిస్సు, రోచిస్సు, ధనుస్సు, మనస్సు, శిరస్సు, చక్షుస్సు, ఆయుస్సు ఇవి యశః ప్రభృతులు.

34. సకారాంత మహద్వాచక శబ్దములకు సకారలోపంబేని, ద్వితీయైక వచనాంతతుల్యంబేని వచ్చును. అప్పుడు ప్రత్యయము చేర్పబడును.

ఉదా:—అంగిరాః, అంగిరుఁడు, అంగిరసుఁడు; ఉగ్రశ్రవాః, ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు; ప్రచేతాః, ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు.

35. వేధశ్శబ్దమునకు వేధయనియు, పురోధశ్శబ్దము పురోధ, పురోధసుఁడు అను రూపములను పొందును.

36. ద్యు శబ్దము దివియనియు, హృచ్ఛబ్దము హృదియనియు రూపములను బొందును.

# 3. సంధిసూత్రములు.

## Rules of Sandhi.

### (A) సంస్కృత సంధులు.

1. సవర్ణదీర్ఘ సంధి:—అ. ఇ. ఉ. ఋ అను వర్ణములకు అ ఇ. ఉ. ఋ అను వర్ణములు పరమైనయెడల దీర

మేకాదేశముగావచ్చును. (ఏకాదేశమునఁ బూర్వ పరస్థానమందలి రెండు వర్ణములును బోయి యొక వర్ణము వచ్చుట)

ఉదా:—అ + అ = ఆ, దేవ + అగారము = దేవాగారము.

అ + ఆ = ఆ, దేవ + ఆలయము = దేవాలయము.

ఆ + అ = ఆ, లతా + అంతము = లతాంతము.

ఆ + ఆ = ఆ, మహా + ఆనందము = మహానందము.

ఇ కా ర ము.

ఇ + ఇ = ఈ, హరి + ఇందిర = హరీందిరలు.

ఇ + ఈ = ఈ, కవి + ఈశ్వరుఁడు = కవీశ్వరుఁడు.

ఈ + ఇ = ఈ, మహీ + ఇంద్రుడు = మహీంద్రుడు.

ఈ + ఈ = ఈ, గౌరీ + ఈశుఁడు = గౌరీశుఁడు.

ఉ కా ర ము.

ఉ + ఉ = ఊ, భాను + ఉదయము = భానూదయము.

ఉ + ఊ = ఊ, ధేను + ఊధస్యము = ధేనూధస్యము.

ఊ + ఉ = ఊ, వధూ + ఉక్తము = వధూక్తము.

ఊ + ఊ = ఊ, వధూ + ఊరీకారము = వధూరీకారము

ఋ కా ర ము.

ఋ + ఋ = ౠ; పితృ + ఋణము = పితౄణము. పితృ ఋణము, పితృణము.

ఋకారాంతశబ్దములకు ఋకారము పరమైన నీవిధమున మూఁడు రూపములగును.

(2) గుణసంధి:—అకారమునకు ఇ ఉ వర్ణములు పరమైన యెడల గ్రమముగా ఏ ఓకారము లేకాదేశములుగా వచ్చును.

ఉ:—ఏకారము.

అ + ఇ = ఏ; దేవ + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు.
అ + ఈ = ఏ; దేవ + ఈశుఁడు = దేవేశుఁడు.
ఆ + ఇ = ఏ; మహా + ఇంద్రుఁడు = మహేంద్రుఁడు.
ఆ + ఈ = ఏ; మహా + ఈశ్వరుఁడు = మహేశ్వరుఁడు.

ఓకారము.

అ + ఉ = ఓ; చంద్ర + ఉదయము = చంద్రోదయము.
అ + ఊ = ఓ; దేవ + ఊర్జితము = దేవోర్జితము.
ఆ + ఉ = ఓ; మహా + ఉదయము = మహోదయము.
ఆ + ఊ = ఓ; రమా + ఊరీకారము = రమోరీకారము.

(3) వృద్ధిసంధి:— అకారమునకు ఏ ఐ ఓ ఔ వర్ణములు పరమైనయెడల ఐ ఔవర్ణములు క్రమముగావచ్చును.

ఐకారము.

అ + ఏ = ఐ; కృష్ణ + ఏకత్వము = కృష్ణైకత్వము.
ఆ + ఏ = ఐ; ప్రజా + ఏకీభావము = ప్రజైకీభావము.

అ + ఐ = ఐ; సర్వ + ఐశ్వర్యము = సర్వైశ్వర్యము.

ఆ + ఐ = ఐ; మహా + ఐశ్వర్యము = మహైశ్వర్యము.

ఔ కా ర ము.

అ + ఓ = ఔ; దేవ + ఓకస్సు = దేవౌకస్సు

ఆ + ఓ = ఔ; మహా + ఓఘము = మహౌఘము.

అ + ఔ = ఔ; సర్వ + ఔత్సుక్యము = సర్వౌత్సుక్యము.

ఆ + ఔ = ఔ; మహా + ఔత్కంఠ్యము = మహౌత్కంఠ్యము.

(4) యణాదేశసంధి.—సవర్ణముకాని యచ్చుపరమగుచుండ ఇ ఉ ఋ లకు యణాదేశమగును.

ఉదా:—ఇ + అ = య; గిరి + అగ్రిము = గిర్యగ్రిము.

ఇ + ఆ = యా; అతి + ఆశ్చర్యము = అత్యాశ్చర్యము.

ఇ + ఉ = యు; అతి + ఉగ్రిము = అత్యుగ్రిము.

ఉ + అ = వ; మధు + అరి = మధ్వరి.

ఋ + అ = ర; పితృ + అంశము = పిత్రంశము.

(5) సకారాంతశబ్దసంధి:—

1. సకారాంతములగు మనస్ మొదలగుశబ్దములకు చ. ఛ. వర్ణములు పరమైన సకారమునకు శకారము వచ్చును.

ఉదా:—మనస్ + చలనము = మనశ్చలనము.

2. సకారాంత పదముల సకారమునకును క. ఖ. ప. ఫ వర్ణములు పరమైన విసర్గమువచ్చును.

ఉదా:—మనస్ + కమలము = మనఃకమలము.

తపస్ + ఫలము = తపఃఫలము.

3. ఇస్. ఉస్. అంతమందుఁగల శబ్దములకు క. ఖ. ప. ఫ. వర్ణములు పరమైన షకారమువచ్చును.

ఉదా:—దుస్ + కరము = దుష్కరము

బహిస్ + కారము = బహిష్కారము.

4. మఱికొన్ని రూపములు.

ప్రాతస్ + అశనము = ప్రాతరశనము.

అహస్ + గణము = అహర్గణము.

ఆశీస్ + నాదము = ఆశీర్నాదము.

శ్రేయస్ + మూర్తి = శ్రేయోమూర్తి.

తపస్ + బలము = తపోబలము.

మనస్ + దయితుఁడు = మనోదయితుఁడు.

(6.) హల్ సంధి:—హలంత శబ్దములపై హల్లాదేశమైనపుడేర్పడు రూపములు.

ఉదా:—తత్ + టీక = తట్టీక.

దిక్ + గజము = దిగ్గజము.

చిత్ + రూపము = చిద్రూపము.

తరు + ఛాయ = తరుచ్ఛాయ.

లక్ష్మి + ఛాయ = లక్ష్మిచ్ఛాయ.

గీర్ + పతి = గీఃపతి, గీష్పతి.

పుం + పౌత్రుఁడు = పుంస్పౌత్రుఁడు.

పుం + ప్లవంగము = పుంస్ప్లవంగము.

పుం + తేజము = పుంస్తేజము.

పుం + చైతన్యము = పుంశ్చైతన్యము.

పుం + చ్యుతి = పుంశ్చ్యుతి.

పుం + టిట్టిభము = పుంష్టిట్టిభము.

(7) విసర్గసంధి:—ఉదా:—మనః + రథము = మనోరథము.

ధనుః + అగ్రిము = ధనురగ్రిము.

ధనుః + ధరుఁడు = ధనుర్ధరుఁడు.

అంతః + గతము = అంతర్గతము.

సః + రాజ్యము = స్వారాజ్యము

భాః + కరుఁడు = భాస్కరుఁడు.

మనః + చలనము = మనశ్చలనము.

ధనుః + టంకారము = ధనుష్టంకారము.

మనః + శాంతి = మనశ్శాంతి.

సరః + షండము = సరష్షండము

B తెనుఁగు సంధులు.

సంధి:—పదము లొకటితో నొకటి చేరునపుడు కలుగు రూపభేదము సంధి యనఁబడును. (సంధి యనఁగా కలయిక) ఇది. 1 అచ్సంధి 2 హల్సంధి యని రెండు విధములు.

1. అచ్సంధి:—మొదటి పదము తుది యచ్చులోపించి యచట రెండవ పదము మొదటియచ్చు నిల్చుట యచ్సంధి యనఁబడును.

1 తెనుగుభాషయందు అ. ఇ. ఉ. ల మీఁద నచ్చు వచ్చిననే సంధియగును.

ఉదా:—అ; మేన+అత్త = మేనత్త

ఇ; సేవించితివి+అయ్య = సేవించితివయ్య

ఉ; రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు

2 దీర్ఘాచ్చులకు సంధికాదు.

ఉదా:—మా + అమ్మ = మాయమ్మ.

3 సంధిలేనిచోట నచ్చునకు మారు యకారము వచ్చును.

ఉదా:—మా + అమ్మ = మాయమ్మ.

(1) అకారము.

అకారమున కచ్చుపరమైనపుడు సంధిబహుళము.

1 ఉదా:—మేన + అత్త = మేనత్త, మేనయత్త.

2 నామంబుల తుదిఅకారమునకు (శ్రేష్టవాచకంబులగు అన్నాదులును, ఆ కును పరమైనచో సంధి నిత్యము.

(అన్న, అయ్య, అక్క, అమ్మ, అప్ప, ఆయి, అవ్వ, అన్నాదులు).

ఉదా:—రామ+అన్న = రామన్న; రామ + అయ్య = రామయ్య; భీమ + అక్క = భీమక్క; రంగ +

అమ్మ = రంగమ్మ; రామ + అప్ప = రామప్ప; సీత + ఆయి = సీతాయి; రంగ + అవ్వ = రంగవ్వ, చింత + ఆకు = చింతాకు.

3. స్త్రీవాచక, తత్సమ, సంబోధ, నావధారణంబులకు సంధిలేదు.

ఉదా:– స్త్రీ వాచకము:– అమ్మ + ఎక్కడ = అమ్మయెక్కడ.
తత్సమము:– హంస + ఏది = హంసయేది.
సంబోధనము:– చెలువుఁడ + ఇటు = చెలువుఁడయిటు.
అవధారణము:— రాముఁడ + అతఁడు = రాముఁడయతఁడు.

(2) ఇ కా ర ము.

1. ఇకారాంతనామవాచకములకు అన్నాదులు పరమైనపుడు సంధిబహుళము.

ఉదా:– లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ, రెడ్డి + అన్న = రెడ్డన్న, జానకి + అయ్య = జానకయ్య, కోమటి + అక్క = కోమటక్క, దాసరి + అప్ప = దాసరప్ప.

2. మధ్యమపురుషమునందలి ఇకారమునకు సంధి నిత్యము.
ఉదా:– సేవించితివి + అచ్యుతుని = సేవించితివచ్యుతుని.

3. ప్రథమోత్తమ పురుషల ఏమ్యాదుల ఇకారమునకు సంధి వైకల్పికము.

(ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఎది, ఏది, ఎవి, ఏవి ఇవి ఏమ్యాదులు. ఇవి యాకృతిగణము.)

ఉదా :—ప్రథమపురుష : వచ్చిరి + అసురులు = వచ్చి రసురులు, వచ్చిరి యసురులు.

ఉత్తమపురుష : వచ్చితిమి + ఇచటికి = వచ్చితిమిచటికి; వచ్చితిమియిచటికి.

అది + ఏమి=అదేమి, అదియేమి. మఱి + ఏమి = మఱేమి, మఱియేమి.

4. త్వార్థంబైన ఇకారమునకు సంధిలేదు.

ఉదా:—చూచి + ఆడెను = చూచి యాడెను.

### (3) ఉకారము.

1. ఉకారమున కచ్చు పరమైనపుడు సంధి నిత్యము.

ఉదా :—రాముఁడు + అతఁడు = రాముఁడతడు. రాఁడు + అతఁడు = రాఁడతఁడు.

2. ప్రథమకాక తక్కిన విభక్తుల యొక్కయు శత్రర్థక చు వర్ణముయొక్కయు ఉకారమున కచ్చు పరమైనపుడు సంధి వైకల్పికము.

ఉదా :—నన్ను + అడిగె = నన్నడిగె, నన్ననడిగె.

నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె

నాకున్ + ఇచ్చె = నాకిచ్చె, నాకునిచ్చె.

ఎందున్ + ఉంటివి = ఎందుంటివి. ఎందునుంటివి.

చేయుచున్ + ఉండె=చేయుచుండె. చేయుచునుండె.

3. రూపాంతరమందు ద్విత్వముఁగల శబ్దముల ఉకారమున కచ్చు పరమైనపుడు సంధిలేదు.

(అనఁగా నన్ను, నిన్ను, తన్ను, తమ్ము, మమ్ము, మిమ్ము.)

ఉదా:—నన్ను + ఏలె=ననునేలె; తమ్ము + అడిగె = తమునడిగె.

4. వాక్యావసానమున సంధిలేమి దోషముగాదు.

ఉదా: —రాముఁడు మంచివాఁడు-ఆతనినమ్ముట మేలు.

5. ఏసి,ఎడు అనునవిపరంబగునపుడన్నియచ్చులకు సంధియగును.

ఉదా:—గంపెఁడు + ఏసి = గంపెఁడేసి;తట్ట + ఎఁడు=తట్టెఁడు

6. పదమధ్యస్వరంబులకు సంధి బహుళము.

ఉదా :—రాముల + అందు = రాములందు; రాములయందు.

ఎనిమిది + అవ = ఎనిమిదవ ; ఎనిమిదియవ.

గంప + అంత = గంపంత ; గంపయంత.

2. ద్రుతప్రకృతిక సంధి.

(2) ద్రుతప్రకృతిసంధి :— 1. ద్రుతమున కచ్చు పరమైనపు డేర్పడునది.

ఉదా :—చూచెన్ + అతఁడు=చూచెనతఁడు.

2. ఇఁకాదుల కచ్చుపరమైనపుడు సంధివైకల్పికము.

ఉదా :—ఇఁక + ఏమి = ఇఁకనేమి,ఇఁకేమి.

(ద్రుతప్రకృతికములకు హల్లులు పరమైన నగుమార్పులు)

(ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగును.)

ఉదా :—చూచెను + కంజాక్షుఁడు = చూచెను గంజాక్షుఁడు.

కాసెను + చంద్రిక = కాసెను జంద్రిక.

చేసెను + టక్కులు = చేసెను డక్కులు.

కోసెను + తలిరులు = కోసెను దలిరులు.

కూసెను + పక్షులు = కూసెను బక్షులు.

2. అట్లు రాఁబడిన (ఆదేశ) సరళములకు ముందున్న ద్రుతమునకు లోపముగాని, బిందువుగాని, అర్ధబిందువుగాని సంశ్లేషము (మీఁది హల్లుతోఁ గలియుట) గాని యగును.

ఉదా:—లోపము — చూచె గంజాక్షుఁడు.

బిందువు- చూచెం గంజాక్షుడు

(అర్ధబిందువు — చూచెఁ గంజాక్షుఁడు.

సంశ్లేష — చూచెన్గంజాక్షుఁడు.

3. వర్గయుక్సరళంబులు (పరంబు లగునపుడు ద్రుతమునకు లోప, స్వత్వ, పూర్ణబిందు, సంశ్లేషములు, విభాషనగును. (స్వత్వము యథారూపము)

| ఉదా:— | సరళములు | వర్గయుక్కులు |
|---|---|---|
| లోపము:— | వచ్చెజలజాక్షుఁడు | చచ్చె ఖచరుఁడు |
| స్వత్వము:— | వచ్చెను జలజాక్షుఁడు | చచ్చెను ఖచరుఁడు |
| పూర్ణబిందువు:— | వచ్చెంజలజాక్షుఁడు | చచ్చెంఖచరుఁడు |
| సంశ్లేషము:— | వచ్చెన్జలజాక్షుఁడు | చచ్చెన్ఖచరుఁడు |

4. ద్రుతమునకు సరళములు, స్థిరములు, పరమైనపుడు లోప సంశ్లేషములు విభాషనగును.

| | లోప | సంశ్లేష |
|---|---|---|
| ఉదా:—వచ్చెనుగోవులు | వచ్చెగోవులు | వచ్చెన్గోవులు |
| మెఱసెను ఖడ్గము | మెఱసెఖడ్గము | మెఱసెన్ఖడ్గము |

5. అంట ఇంక చుండు అనువానిలోఁ దప్ప మొదటికుఱుచ వర్ణముమీఁద అరసున్నగాని ద్రుతముగాని యుండదు.

6. తాను నేను పదముల ద్రుతమునకు సంశ్లేష లేదు.

ఉదా:—తాను + చదివె = తాఁజదివె, తాను జదివె.

తాను + వినె = తావినె, తాను వినె.

7. కొన్నియెడల ద్రుతము మీఁద నకారము కానంబడు చుండును.

ఉదా:—అదియును న్గాఁక; దివంబునుఙ్బోలె.

8. వాక్యావసానంబున ద్రుతమునకేని ద్రుత స్వరంబున కేని లోపము బహుళముగ నగును.

ఉదా:—వాఁడు వచ్చెను. వాఁడు వచ్చె. వాఁడు వచ్చెఁ.

9. వర్గయుక్కులును, సరళములునుపరంబగునపుడు ద్రుతము నకు స్వత్వసంశ్లేషలోప పూర్ణ బిందువులు విభాషనగును.

ఉదా:—సంశ్లేష:—కొలిచెదన్నారాయణుని.

స్వత్వము:—కొలిచెదను నారాయణుని.

లోపము:—కొలిచెద నారాయణుని.

## 3. కళాసంధి.

1. ప్రథమావిభక్తి, అవ్యయము, కళలగు క్రియల మీఁదను పరమైన పరుషములకు గ స డ ద వ లగును.

ఉదా:—వాఁడు కొట్టె = వాఁడు గొట్టె.

మనము చూచితిమి = మనము సూచితిమి.

నీవు టక్కరివి = నీవు డక్కరివి

అతఁడు పలికె = అతఁడు వలికె

ఏమిచెప్పితివి = ఏమి సెప్పితివి.

రావుకదా = రావుగదా.

## (4) ఆమ్రేడితసంధి. (Reduplication)

ఆమ్రేడితమనఁగానుచ్చరించిన శబ్దమును తిరిగియుచ్చరించుట

1. ఆమ్రేడిత మందన్నియచ్చులకు సంధియగును.

ఉదా:—ఆహా + ఆహా=ఆహాహా

ఔరా + ఔరా=ఔరౌరా

ఓహో + ఓహో=ఓహోహో

ఏగి + ఏగి =ఏగేగి

2. ఆమ్రేడితము పరంబగునపుడు కడాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల సదంతమగు ద్విరుక్తటకారమగును.

ఉదా:—కడ + కడ=కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టఎదురు

కొన + కొన=కొట్టకొన

నడుము + నడుము = నట్టనడుము

పగలు + పగలు = పట్టపగలు

పిడుగు + పిడుగు = పిట్టపిడుగు

మొదలు + మొదలు = మొట్టమొదలు

3. ఆమ్రేడితము పరంబగునపుడు ద్విత్వలోపము బహుళముగ నగును.

ఉదా:—అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్

దినము + దినము = దినదినము

ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్.

4. ఆమ్రేడితమునం దించుక, నాఁడు మొదలైనవానికం తిమాక్షర లోపము బహుళముగ నగును.

ఉదా:—ఇంచుక + ఇంచుక = ఇంచించుక.

నాఁడు + నాఁడు = నానాఁడు.

లోపల + లోపల = లోలోపల.

లోన + లోన = లోలోన.

5. అందదుకు మొదలైనవి ప్రయోగములను బట్టి గ్రహింపదగినవి.

ఉదా:—అతుకు + అతుకు = అందదుకు.

ఇంకులు + ఇంకులు = ఇట్టింకులు.

చెదరు + చెదరు = చెల్లాచెదరు, చెల్లచెదరు.

ముసుఁగు + ముసుఁగు = ముచ్చుముసుఁగు.

ఆఁక + ఆఁక = అల్లాఁక.

చవుకము + చవుకము = చచ్చవుకము.

మిట్టు + మిట్టు = మిఱుమిట్టు.

తునియ + తునియ = తుత్తునియ.

తుమురు + తుమురు = తుత్తుమురు.

ఆఁకలి + ఆఁకలి = అల్లాఁకలి.

త్రాఁగు + త్రాఁగు = తప్పత్రాఁగు.

కదలు + కదలు = గ్రక్కదలు.

నను + ఇల్లు = నట్టిల్లు.

నిడు + ఊరుపు = నిట్టూరుపు.

2. ద్వంద్వసమాసమున పదంబు కంటెంబరమైన పరుషములకు గ. స. డ. ద. వ లు ప్రాయికముగ నగును.

ఉదా:— అరి + కోరు = అరిగోరులు.

కాలు + చేయి = కాలుసేతులు.

టక్కు + టెక్కు = టక్కుడెక్కులు.

ఊరు + పల్లె = ఊరుపల్లెలు.

(2) ద్రుతము. 3. సమాసంబున ద్రుతము లోపమగును. ఉదంత తద్ధర్మార్థక విశేషముదప్ప నెట్టిద్రుతప్రకృతికమైనను విశేషణమైనచోఁ గళ యుష్టగును.

ఉదా:— ఎల్లన్ + పాపములు = ఎల్లపాపములు.

4. కర్మధారయములందు ము వర్ణమునకుఁ బు, ంపు, లగును.

ఉదా:— సరసము + పలుకు = సరసపుఁబలుకు, సరసంపుఁబలుకు.

5. సమాసంబుల నుకారాంత స్త్రీసమంబులకును, పుంపులకును, పరుష సరళములు పరములగునపుడు నుగాగమ మగును.

ఉదా: —

అర్ధబిందువు:— సరసపుఁబలుకులు, సరసంపుఁబలుకులు.

పూర్ణబిందువు:— సరసపుంబలుకులు, సరసంపుంబలుకులు.

సంశ్లేషము: — సరసపు స్పలుకులు, సరసంపుస్పలుకులు.
లోపము:— ఉన్నతపుగోడుగు ఉన్నతంపుగోడుగు
పూర్ణబిందువు:—ఉన్నతపుంగొడుగు, ఉన్నతపుంన్గొడుగు.
సంశ్లేషము: ఉన్నతపున్గొడుగు. ఉన్నతంపున్గొడుగు.

6. సమాసముల యందు ద్రుతమునకు స్వాతంత్ర్యము లేదు.

ఉదా :—అలరునుజోంపములు.

7. తలంబ్రాలు లోనగు నలుక్సమాస బుల ద్రుతంబునకు లోపము లేదు.

(విభక్తి ప్రత్యయములోపింపకుండినలుక్సమాసమగును)

ఉదా:—తలన్ + ప్రాలు=తలంబ్రాలు
ఊరన్ + పంది=ఊరబంది.
ఒల్లన్ + పాటు=ఒల్లంబాటు.
సేసన్ + ప్రాలు=సేసంబ్రాలు.

8. షష్ఠీసమాసమం దుకార బుకారముల కచ్చుపరమై నపుడు నుగాగమ మగును.

ఉదా:—రాజు + ఆజ్ఞ=రాజునాజ్ఞ
విధాతృ + ఆనతి = విధాతృనానతి

9. ఉకారాంత స్త్రీసమంబులకును, పుం,పు లకును అకారాంత గుణవాచకములకును తనంబు పరంబగు నపుడు నుగాగమమగును.

ఉదా:—

ఉకారాంత స్త్రీసమములు:—సొగసుందనము, సొగసుందనము, సొగసున్దనము.

పు. ంపు లకు:— సరసపుఁదనము; సరసపుందనము;
సరసపున్దనము.

అకారాంతగుణవాచకములు:- చక్కఁదనము; చక్కందనము.
చక్కన్దనము

10. సమాసంబుల ప్రాంతాములతొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగ నగును.

ఉదా:— లేఁత+దూడ=లేదూడ
పూవు+బంతి=పూబంతి

11. లోపింపఁగా మిగిలినదానికి (లుప్తశేషమునకు) పరుషంబులు పరంబులగునపుడు నుగాగమమగును.

ఉదా:— ప్రాఁత+కెంపు=ప్రాఁగెంపు
లేఁత+కొమ్మ=లేఁగొమ్మ.
పూవు+తోఁట=పూదోఁట
వేఁగు+పోక=వేఁబోక.

12. క్రొత్త, కెంపు, క్రిందు శబ్దముల కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును, కొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబును బహుళముగ నగును. (ఆద్యక్షరశేషమనఁగా మొదటి యక్షరము గాక మిగిలినది.)

ఉదా:—

నుగాగమము:— క్రొత్త+చాయ=క్రొంజాయ,
క్రొత్త+పువ్వు=క్రొంబువ్వు

చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు
పొదరు + ఇల్లు = పొదరిటిల్లు, పొదరిలు.

17. కర్మధారయమున మకారముగాకున్నను గొన్నిచోటుల టుగాగమమగును

ఉదా:— నుక్కి + ఎద్దు = దుక్కిటెద్దు.
మిద్దె + ఇల్లు = మిద్దెటిల్లు.
తేనె + ఈగ = తేనెటీగ.

18. మఱికొన్ని రూపములు.

ఉదా:— పాము + అమ్మి = పాసరమ్మి
తామర + ఆకు = తామరపాకు
బొమ్మ + ఇల్లు = బొమ్మరిల్లు.

19. కర్మధారయంబుల నదంతములకు ఆలు పరమగునపుడు నిత్యముగను ఉదంతముల మీఁద బహుళముగ రుగాగమమగును.

ఉదా:— అకారాంత:— పేద + ఆలు = పేదరాలు.
మనుమ + ఆలు = మనుమరాలు.
ఉకారాంత:— పాము + ఆలు = పాపరాలు.
వియ్యము + ఆలు = వియ్యపురాలు.
టుగాగమము:— పురుడు + ఆలు = పురుటాలు
పేరంటము + ఆలు = పేరంటాలు
ఈలువు + ఆలు = ఈలువుటాలు

20. కర్మధారయంబుల దత్సమంబులకు ఆలు పరమైనపుడు అత్వమునకు ఉత్వంబును రుగాగమంబును అగును.

ఉదా:—ధీర+ఆలు=ధీరురాలు,

గుణవంత+ఆలు=గుణవంతురాలు.

21. ఆ. ఈ. ఏ. (త్రికము) సమాసములో మొదటి పదము లైయున్నప్పుడు వానికి హ్రస్వమును తరువాతి పదము మొదటి హల్లునకు ద్విత్వమును వచ్చును.

ఉదా:— ఆ+మగువ=అమ్మగువ.

ఈ+తటి=ఇత్తటి.

ఏ+పని=ఎప్పని.

(రేఫమునకును, శ, ష, స లకును నిల్లురాదు.)

ఉదా:—ఆ+రాముడు=ఆరాముడు, ఆ+శని=ఆశని

22. కర్మధారయమునం గొన్నిచోట్ల మువర్ణమునకు బిందుపూర్వక పవర్ణమును, గొన్నిచోట్ల పవర్ణమునువచ్చును బిందుపూర్వక పవర్ణము:ఉదా:—అమ్మ+శయ్య= అంపశయ్య.

పాము+జాతి=పాపజాతి.

ప్రేము+బెత్తము=ప్రేపబెత్తము.

పవర్ణము. ఉదా:—

జనుము+నార=జనుపనార,

ఇనుము+ముక్క=ఇనుపముక్క.

మినుము+గింజ=మినుపగింజ.

23 సమాసములో అది, అవి అను పదముల అకారము లోపించును.

ఉదా:—నా + ఆది = నాది - నీ + అవి = నీవి.

24 హల్లు పరమగునపుడు అను, కొను, చను లోనగు క్రియల వలన గలిగిన విశేషణముల కడపటి ఉకారము వైకల్పికముగ లోపించును.

ఉదా:—గరుడుండు + అను = గరుడన్

పెన + కొను = పెనంగొన్

ఒకడు + చను = ఒకడుచన్

25 కర్మధారయంబున పరమైన పరుషములకు గసడదవలు వైకల్పికముగ నగును.

ఉదా:–ఏ + చుట్టములు = ఏచుట్టములు.

పెద్ద + కాలము = పెద్దగాలము.

26 షష్టీ సమాసమందలి నీ, ల ల మీంది యచ్చులకు నెందేని లోపము వైకల్పికముగ నగును.

ఉదా:–ఇంద్రుని + వలె = ఇంద్రునివలె,

బింబముల + రుచుల్ = బింబముల్ రుచుల్.

27 సమాసముల చేత, తోడ, వలన ల కిత్వంబగును.

ఉదా:–నీ + చేత = నీచేత, నా + తోడ = నాతోడి.

వాని + వలన = వానివలని.

28 అందు మొదలగువానికి ఆలిఅనునది సమాసములవచ్చును.

ఉదా:–నా + అందు = నాయందలి. ఎందు + అవి = ఎందలి మున్నగునవి.

29. పడు మొదలైనవి పరంబగునపుడు ము వర్ణమునకు లోప పూర్ణబిందువులు విభాషనగును.

ఉదా:—లోప: శ్రమము + పడు = శ్రమపడు.

పూర్ణబిందు - శ్రమం బడు.

30. మధ్యమపురుష ము వర్ణమునకు హల్లుపరమైనను లేక జనరమైనను లోపము విభాషనగును.

ఉదా: చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుము - చూడు.

31. వ్యతిరేకమధ్యమము వర్ణమున కెల్లయెడల లోపము విభాషనగును.

ఉదా: — నమ్మకుము + ఇటు = నమ్మకుమిటు, నమ్మకిటు.

32. ధ్వనిని వెల్లడించు పదములు రెండు, మూడు, నాలుగు నాడవచ్చును.

ఉదా:— భుగ భుగ, గడ గడ గడ, తళ తళ తళ.

33. ధ్వన్యనుకరణమునకు అను ధాతువు పరమైనపుడు కొన్నియెడల ముగాగమ మగును.

ఉదా:—సల సల + అని = సల సల మని.

కన కన + అని = కన కన మని.

34. అనుధాతువు పరమైనపుడు తుదిహల్లునకు ద్విత్వమగు.

ఉదా:— భామ్ + అని = భామ్మని

పటిల్ + అని = పటిల్లని

35. ముగాగమమగుచో ద్విత్వము విభాషనగును.

36. సమాసమునం దుత్తరపదమైన మూఁడు శబ్దము యొక్క డువర్ణలోపంబును మీఁదిహల్లునకు ద్విత్వము నగును.

ఉదా:— మూఁడు + కోణము=ముక్కోణము.

మూఁడు + త్రోవ=ముత్త్రోవ.

37. అనుధాతువు పరమగునపుడు విసర్గము లోపించును.

ఉదా:—త్వమేవగతిః + అనె=త్వమేవగతియనె.

38. అనుధాతువు పరమగునపుడు ఉకారము మీఁది విసర్గమునకు వుపర్ణమాదేశమగును.

ఉదా: – అయంవిష్ణుః + అనె=అయంవిష్ణువనె.

39. బహువర్ణలు వర్ణకమునకుఉకారలోపమువైకల్పికము.

ఉదా:—జనుల్ మెత్తురే, మెత్తురేజనుల్.

40. నా.నీ శబ్దములకు సమాసమున దువర్ణము వైకల్పికముగా అంతాగమ మగును.

ఉదా:—నాభాగ్యము=నాదుభాగ్యము,నీపుణ్యము=నీదు పుణ్యము.

41. ఎదాను అను ప్రయుక్తంబగునపుడు క్రియాంతములగు ము. డు. లు వు, రు లగును.

ఉదా:—చూఁడుము + ఎ=చూఁడవే,

చూఁడుఁడు + ఎ=చూఁడరే.

# విశేష్య' సర్వనామ' సంఖ్యావాచక' వర్ణసమామ్నా రూపభేదములు.

తెనుగుభాషలోని పదములు 1 నామవాచకములు 2 సర్వనామములు 3విశేషణములు 4క్రియలు 5అవ్యయములు అని అయిదు విధములు.

నామవాచకములు The noun:—మనుష్యులు, జంతువులు, పట్టణములు, నదులు, కొండలు మొదలగువాని పేర్లు. నామవాచకములు లేక విశేష్యములు అనఁబడును.

ఇవి 1 సంజ్ఞావాచకములు, 2 జాతివాచకములు, 3 గుణవాచకములు 4 క్రియావాచకములు, అని నాలుగు విధములు.

1. సంజ్ఞావాచకములు, (Proper Noun):—మనుజులు, దేశములు, జంతువులు,కొండలు మొదలగువానిలోనొక్కొక్కదానికిఁ జెందుఁ బేర్లు

ఉదా:—రాముఁడు,సీత,వింధ్య, గోదావరి,కృష్ణ,గుంటూరు

2. జాతివాచకములు, Real Noun:—జంతువస్తుసమూహములలో నొక్కొక్క తరగతికిఁ జెల్లు పేర్లు.

ఉదా:—మనుష్యుఁడు, వృక్షము, నది, రాయి.

3. గుణవాచకము Abstract Noun :—వేరు వేరుగుణము పేర్లను దెలుపునది.

ఉదా:—తియ్యని, యోగ్యత. చెడ్డతనము, నల్లని.

4. క్రియావాచకములు Verbal Noun:—క్రియలవలన గలిగిన పేర్లను చెల్పును.

ఉదా:—వంచుట, చేయుట.

## సర్వనామములు - The Pronouns.

(2) సర్వనామములు:— నామవాచకములు పలుమాఱు వాడఁబడుటకు మాఱుగా నుపయోగింపఁబడు పదలుము సర్వనామములు.

నామవాచకములకుమాఱుగా నుపయోగింపఁబడునవి గాన వీనికి లింగ, వచన, విభక్తులు గలవు. సంబోధన విభక్తిమాత్రమువిశేషణములతోఁగూడియున్ననే గలుగును.

ఉదా:—ఓ చిన్నవాఁడా! ఓసి చిన్నదాన!

ఇవి 1. పురుషబోధక సర్వనామములు (Personal Pronouns.)

2. సంబంధ సర్వనామములు (Relative Pronouns)

3. విశేషణ సర్వనామములు

4. ప్రశ్నవాచక సర్వనామములు (Interrogative Pronouns)

అన నాలుగు విధములు.

1. పురుషబోధక సర్వనామములు:—Personal Pronounr.)

పురుషములను దెల్పును.

ఉదా:—నీవు - నేను - అది - అవి.

2. సంబంధ సర్వనామములు:— (Relative Pronouns)
వాక్యములకుఁ గల సంబంధము దెల్పును.

3. విశేషణ సర్వనామము:—(Adjective Pronoun)
సర్వనామ ధర్మములను, విశేషణ ధర్మములను గలిగి యుండునది.

ఉదా:—అందఱు మనుజులు నిందింతురు.
విశేషణ:—మనుజులు నందఱు పనులు నిందింతురు.

ఇది 1. నిర్దిష్ట సర్వనామము 2 అనిర్దిష్టసర్వనామము.
3 సంఖ్యావాచక సర్వనామము అని మూఁడు విధములు

1. నిర్దిష్ట సర్వనామము:—(Demonstrative Adjective Pronoun) తమతో సంబంధించు విషయములను నిర్దేశించునది.

ఉదా:—ఆ గ్రామము - ఈ తోఁట.

ఆ. ఈ. ఏ రెండును నిర్దిష్ట సర్వనామములు.

2 అనిర్దిష్ట సర్వనామము:—Indefinite Adjective Pronoun తమతో సంబంధించు విషయముల నిర్దేశింపనివి. ఉదా: పెక్కు తెగలు.

(అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పలు, అందఱు, ఇందఱు, కొందఱు, పెక్కు, పెక్కండ్రు, పెక్కురు, పలువురు, పలుగుండ్రు ఇవి అనిర్దిష్ట సర్వనామములు.)

3. సంఖ్యావాచక సర్వనామములు:—Numeral Adjective pronouns:—సంఖ్యను దెలుపుటయందు వర్తించునవి.

ఉదా:-ఒకఁడు నిజముఁ జెప్పెను కాని, యిద్దరు కల్లలాడిరి.
(ఒక్కఁడు, ఒక్కరిత, ఒక్కటి, ఇద్దరు, ఇరువురు, రెండు మూఁగురు, ముగ్గురు, మూఁడు మొదలైనవి.)
(పూర్వులు వీనిని సర్వనామములుగా జెప్పిరి కాని వీనియందు కేవల విశేషణ ధర్మమే కానఁబడుటఁ జేసి విశేషణములని చెప్పుటయే మేలని తోఁచుచున్నది.)

4. ప్రశ్న వాచక సర్వనామము Interrogative pronoun:—ప్రశ్నముల నడుగుటయందు పయోగింపఁబడునవి. ఉదా:—ఏ సంవత్సరమున బుట్టితివి? ఎవ్వఁడు కంసునిఁ గూల్చెను?
(ఏ, ఎందఱు, ఎన్ని, ఇవి ప్రశ్న వాచకములు.)

## పురుషములు.

పురుషములు: 1 ప్రథమ పురుషము, 2 మధ్యమ పురుషము, 3. ఉత్తమ పురుషము అని మూఁడువిధములు.

First person. 1. ప్రథమపురుషము:—ఎక్కడెక్కడి విషయమునో దెలుపును.

(ఈ ప్రథమపురుషయందుదప్ప లింగభేదము లేదు.)

ఉదా:—పుంలింగము-వాఁడు, వీఁడు. స్త్రీలింగము-అది, ఇది. నపుంసకము-అవి, అది. ఇది, ఇవి.

2. మధ్యమపురుషము Second Person :—ఎదుటివానిని దెల్పును.

ఉదా:—నీవు, ఈవు, మీరు, ఈరు.

3. ఉత్తమపురుషము Third Person:-తన సంగతిని దెలుపును.

ఉదా:—నేను,ఏను, మేము, ఏము.

1. తాను అనునది ప్రథమపురుషముల పునరుక్తినిమాన్పుటకు వాడఁబడుచున్నది.

ఉదా:—వాఁడు(తాను)నిన్న వచ్చితి ననెను.

అది (తాను) యోగ్యురాలని తలంచును.

2. పూజయందు ప్రథమపురుషైకవచనపుంలింగమునకు ఆతఁడు, ఆయన, ఇతఁడు, ఈయన యనునవియును, స్త్రీలింగమునకు ఆమె, ఆపె, ఆకె, ఈమె, ఈపె, ఈకె యనునవియు వచ్చును.

3. మనము అనునది మధ్యమోత్తమపురుషముల కేకముగా నుపయోగించు నిత్యబహువచనాంతసర్వనామము. మనము అనఁగా నీవును, నేనును అని యర్థము.

4. మధ్యమోత్తమ పురుష సర్వనామముల విశేషణములకు క్రమముగా నేకవచనమున వు ను లు ను,బహువచనము రు ము లు ను అంతాగమములగును

| | ఏక | బహు |
|---|---|---|
| ఉదా:—మధ్యమ - | నీవు ధన్యుఁడవు | మీరు ధన్యులరు |
| ఉత్తమ - | నేను ధన్యుఁడను | మేముధన్యులము |

౫. ఏమిశబ్దమెప్పుడేకవచనముగానే యుండును. దీని మీఁద షష్ఠి ప్రత్యయనుగు కి ప్రత్యయముదప్ప యితర విభక్తులురావు.

ఉదా:—ఏమిటికి - ఏటికి.

౬. నామవాచకములతో సమాసమగునపుడు సంబంధార్థమునందు నా నీ తా శబ్దములకు దు వర్ణకమును సమాసములేనియెడల ది వర్ణకమునగును.

ఉదా:—నాదుసొమ్ము, నీదుకీర్తి, తనదుమహిమ, నాది నీది తనది.

ఏక పుంలింగము

ఎవఁడు, ఎవ్వఁడు, ఏఁడు ఏవాఁడు,ఏవ్వాఁడు మొదలైనవి.

ఏక స్త్రీలింగము.

ఎవ్వరిత, ఎవ్వత, ఎవరిత, ఎవత, ఎవ్వరితె, ఎవ్వతె, ఎవరితె, ఎవతె, ఎవ్వరుక, ఎవ్వతుక, ఎవతుక, మొదలైనవి.

ఒకఁడు—పుంలింగము.

ఏకవచనము: ఒకఁడు ఒకొఁడు, ఒక్కఁడు ఒక్కొఁడు ఒకరుఁడు ఒకొరుఁడు ఒక్కరుఁడు ఒక్కొరుఁడు, మొదలైనవి.

## స్త్రీ లింగము.

ఏకవచనము: ఒకర్త, ఒకరిత, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒకోరిత, ఒకర్త, ఒకోర్తు, ఒకోర్తుక, ఒకత, ఒకోతుక, ఒక్కరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక, ఒకరితి, ఒకర్తి, ఒకతి, ఒకోరితి, ఒకోర్తి, ఒకోతి, ఒక్కరితి, ఒక్కర్తి, ఒక్కతి, ఒక్కోరితి, ఒక్కోర్తి, ఒక్కోతి, ఒకరితె, ఒకర్తె, ఒకతె, ఒకోరితె, ఒక్కోర్తె ఒకోతె, ఒక్కరితె, ఒక్కర్తె, ఒక్కతె ఒక్కోరితె, ఒక్కోర్తె, ఒక్కోతె. ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక.

## నపుంసకలింగము.

ఏకవచనము:—ఒకటి, ఒకోటి, ఒక్కటి, ఒక్కోటి, ఒక్కట. ఒకండు, ఒకోండు, ఒక్కండు, ఒక్కోండు, ఒండు.

## కొన్ని సర్వనామములకు విభక్తిరూపములు.

### వాడు.

| విభక్తి. | లింగము. | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| ప్రథమా | పుం | వాడు | వారు వారలు, [వాండ్రు |
| | స్త్రీ | అది ఆమె | వారు, వారలు, [వాండ్రు |
| | నపుం | అది అద్ది ఆయుది [అయ్యది. | అవి అవ్వి ఆయువి అయ్యవి. |

| | | | |
|---|---|---|---|
| ద్వితీయా | పుం | వానిన్ | వారిన్ వారలన్ [వాండ్రన్. |
| | స్త్రీ | దానిన్ అదానిన్ [అద్దానిన్. | వారిన్ వారలన్ [వాండ్రన్. |
| | నపుం | దానిన్ | వానిన్ |
| తృతీయా | పుం | వానిచేతన్ | వారిచేతన్ [వారలచేతన్ వాండ్రచేతన్ |
| | స్త్రీ | దానిచేతన్ | ,, |
| | నపుం | వానిచేతన్ | వానిచేతన్ |

ఏ వా రు.

| | | | |
|---|---|---|---|
| ప్ర | పుం | ఏవాఁడు ఎవ్వాఁడు [ఎవ్వఁడు ఎవరు ఏఁడు. | ఏవారు ఏవారలు [ఏవాండ్రు ఎవ్వారు [ఎవ్వరు ఎవరు ఎవండ్రు ఏరు. |
| | స్త్రీ | ఏయది ఎయ్యది [ఎద్ది ఎది ఏది | ఏయవి ఎయ్యవి [ఎవ్వి ఎవి ఏవి |
| న | | ఏయది | ఏయవి |

3. విశేషణములు - **Adjectives.**

(3) విశేషణములు—నామవాచకముల విశేషధర్మములను దెల్పు పదములు విశేషణము లనఁబడును.

ఉదా:—నల్లని తెల్లని, మంచి మొదలైనవి.

ఇవి 1. గుణవాచకములు, 2. సంఖ్యావాచకములు, 3. క్రియావాచకములు, 4. విధేయ వాచకములని నాలుగు విధములు.

1. గుణవాచకములు:—(Adjectives of quality) నామవాచకముల గుణములను దెలుపును.

ఉదా:—తెల్ల, మంచి. నిగ్గు మొ॥

2. సంఖ్యావాచకములు.—(Numeral Adjectives) సంఖ్యను దెలుపును.

ఉదా:—ఇద్దఱు, ముగ్గుఱు.

ఇవి 1. సంఖ్యార్థకములు, 2. సంఖ్యేయార్థకములు 3. పూరణార్థకములు అని మూఁడు విధములు.

1. సంఖ్యార్థకములు: (Cardinal)

ఉదా:—రెండు, మూఁడు.

2. సంఖ్యేయార్థకములు:—(Numeral Adjectives)

ఉదా:—యిద్దరు, ముగ్గురు.

3. పూరణార్థకములు:—(Ordinal)

ఉదా:—రెండవ, మూఁడవ.

4. క్రియావాచకములు:—(Participal Adjectives) క్రియలవలన గలిగిన వానిని దెల్పును.

ఉదా:—కొట్టు, కొట్టుచున్న, కొట్టిన, కొట్టఁగల, కొట్టెడు, కొట్టెడి.

5. విధేయవాచకములు:—నామవాచకములను విశేషింపఁ జేయుచు వానికిఁబూర్వమున నిల్చి వాక్యమును బూర్తి చేయునవి.

ఉదా:— వాఁడు పుణ్యాత్ముఁడు! వీఁడు పెద్దవాఁడు.
కృష్ణుఁడు చదివినవాఁడు.

1. ప్రాయికముగాఁ దెనుఁగు విశేషణములు స్త్రీలింగ సమములై యుండును గాన లింగవచనాదిభేదము లేక యెల్లవిశేష్యముల ముందుఁ బ్రయోగింపఁబడును.

ఉదా:— పెద్దమనుష్యుఁడు, మంచిపడంతి, చిన్నఅడవి, క్రూరమృగములు.

2. విశేష్యములు పరములగునపుడు అకారాంత గుణవాచకముల తుదను నివర్ణకము బహుళముగా వచ్చును.

ఉదా:—నల్లకోక, నల్లనికోక, చక్కనివాలుఁడు చిన్న పుస్తకము.

3. క్రియావాచకములకుదక్క మిగిన విశేషణములకుల ఐన, అగు, అను క్రియాజన్యవిశేషణము వైకల్పికముగావచ్చును.

ఉదా:—నిగ్గు - నిగ్గైన - నిగ్గగు - నిగ్గ.

4 లింగబోధక ప్రత్యయములతోఁ గూడిన విశేషణములకీ యాగమములు నిత్యముగానగును.

ఉదా:—యోగ్యుఁడగు పురుషుఁడు; మృదువగువస్తువు; అందమగు పడంతి.

5. ఒకానొకచోఁ గొన్ని విశేష్యములు విశేషణములుగా వాడబడును.

ఉదా:—పసిఁడికంచము, వెండిచెంబు, రాగిపళ్లెము.

6. స్వభావాధిక్యములను దెలుపునపుడు విశేషణములకు నిజ తరతమ స్థితులగు.

ఉదా:—నిజ:- శ్రేష్ఠమైన-తర:- శ్రేష్ఠతరమైన - తమ:- శ్రేష్ఠతమమైన- నిజ= గొప్ప - తర=మఱిగొప్ప, తమ=మిక్కిలిగొప్ప.

కొన్ని విశేషణములు విశేష్యములవల్ల బుట్టుచున్నవి.

ఉదా :— విశేష్యము — విశేషణము

| విశేష్యము | విశేషణము |
|---|---|
| ఓడు | ఓటి |
| చెవుడు | చెవిటి |
| కుంటు | కుంటి |
| జున్ను | జుంటి |

4. ఔపవిభక్తికములు. (Case suffixes.)

4. ఔపవిభక్తికములు:విభక్తిసహాయముగాజడవాచకముగా లగునామవాచములకును సర్వనామములకును రు-లు-డు—ను—యి మొదలైనవానికి ద్వితీయాద్యేకవచనములు పరంబగునపుడు ఇ - టి — ంటి—తి నర్తకములు వచ్చును. వీనినే ఔపవిభక్తికములందురు.

ఉదా:—ఊరు ఊరి, కాలు కాలి, మ్రాను మ్రాని, త్రాడు త్రాటి, నోరు నోటి, అన్ని అన్నిటి, వేయి వేయింటి, కన్ను కంటి, విల్లు వింటి, అట్టు అట్టిటి, గోయి గోతి, చేయి చేతి, మొదలైనవి.

5. లింగము: (Gender)

1. నామవాచకములకు 1. లింగము 2 వచనము 3 విభక్తులు గలవు.

## (5) లింగము.

లింగము:—స్త్రీపురుషజడాది జాతిభేదములింగమనఁబడును. ఇది 1 పుంలింగము (మహత్తు) 2 స్త్రీలింగము (మహతి) 3. నపుంసకలింగము (అమహత్తు) అని మూఁడువిధములు.

1. పుంలింగము Masculine (మహత్తు):—పురుష వాచకములు పుంలింగములు.

ఉదా:—రాముఁడు, హరి, యెన్న, అయ్య.

2. స్త్రీలింగము Feminine (మహతి):—స్త్రీ వాచకములు స్త్రీలింగములు.

ఉదా:—సత, అమ్మ, అక్క, భారతి.

3. నపుంసకలింగము Neuter (అమహత్తు): జంతువులు. పక్షులు, కొండలు మొదలైన జడవాచకములు నపుంసకలింగములు.

ఉదా:-సింహము, గరుడపక్షి, హిమాలయము, వేపఁచెట్టు.

1. ఇకారాంతములు కాని పదములు పుంలింగమునందు బిందు పూర్వక డు వర్ణము గలుగును.

ఉదా: — (రామ) రాముఁడు, విధాతృడు. శంభుఁడు.

2. కొన్ని నపుంసకలింగములు (ండు) వర్ణనములను జెంది పుంలింగము లగును.

ఉదా:—సముద్రుఁడు, మేఘుఁడు, హిమవంతుఁడు.

3. డువర్ణముతోనుండి పుంలింగములు కాని దేశ్య పదములు పుంలింగసమము లనఁబడును.

ఉదా :— కర్తృభుండు, పరికాండు.

4. అకారాంతకములగు నపుంసకలింగములకు ము వర్ణము వచ్చును.

ఉదా :—వనము, గుఱ్ఱము, పల్లము.

5. ము వర్ణ మంతమందువచ్చు నపుంసకములుకాని పదములు నపుంసక సమములనఁబడును.

ఉదా :—జనము, చుట్టము.

6. మూఁడు లింగములందును ఉకారాంత తత్సమ శబ్దముల చివరను వు వర్ణము వచ్చును.

ఉదా :—శంభువు, వధువు, వస్తువు.

7. స్త్రీలింగ పదముల అంతమందు డు-ము-వు-ల లో నేదియు రాదు.

ఉదా : —వనిత, సీత, అక్క, తల్లి.

8. ఉకారాంతములకు వు వర్ణకము మాత్రము వచ్చును.

ఉదా :—వధువు.

9. పదభేదము వలనఁ గలుగు లింగభేదములు.

| పుంలింగము. | స్త్రీలింగము. |
|---|---|
| పురుషుఁడు | స్త్రీ |
| పిత | మాత |
| వరుఁడు | వధువు |
| పెనిమిటి | పెండ్లము |
| మామ | అత్త |
| బావ | వదినె |

10. పదాంతభేదమువలన గలుగు లింగభేదములు.

| పుంలింగము | స్త్రీలింగము. |
| --- | --- |
| నాయకుఁడు | నాయిక |
| జనకుఁడు | జనని |
| పాలుఁడు | పాలిత |
| వగలాఁడు | వగలాఁడి |
| చెలికాఁడు | చెలికత్తె |

11. పూర్వమొకపదము చేరుటవలనఁ గలుగు లింగభేదములు.

| | |
| --- | --- |
| మగబిడ్డ | ఆఁడుబిడ్డ |
| మగపిల్ల | ఆఁడుపిల్ల |

12. కొన్ని పుంస్త్రీలింగములకు ఏకరూపము కానఁబడుచున్నది.

ఉదా :—వయ్యారి, అసుర.

## 6. వచనము. (Numb r)

వచనము :—ఒకటికిని, ఒకటికంటె నెక్కువకును గలుగు భేదము వచనమనఁబడును. ఉదా:-రాముఁడు, రాములు.

ఇది 1. ఏకవచనము 2. బహువచనము అని రెండువిధములు.

1. ఏకవచనము(Singular.):—ఒకదానిని తెలుపును.

ఉదా :—రాముఁడు, స్త్రీ, వస్తువు.

2. బహువచనము (Plural) :—ఒకదానికంటె నెక్కువను తెలుపును.

ఉదా :—రాములు, స్త్రీలు, వస్తువులు.

1. లింగబోధకములగు డు. ము. వు వర్ణకము లేక వచనము నందే వచ్చును.

ఉదా :— రాముడు, వనము, వస్తువు.

2. నపుంసకలింగ బోధకమగు ము వర్ణమునకు మాముడి (మనత్తు) గాని బిందుపూర్వక (ం) బు వర్ణకము గాని వికల్పముగ వచ్చును.

ఉదా :—వనము-వనమ్ము-వనంబు.

3. సామాన్యముగ ఏకవచనము తుదను లు చేర్చుటవలన బహువచన మేర్పడును.

ఉదా :— రాముడు + లు = రాములు-స్త్రీలు.

4. బహువచనము పరమగునపుడు పుంలింగ బోధకమగు డు వర్ణము లోపించును. [లింగబోధక మనుట చేత్రాడు మొదలైన వానికి లోపము లేదు.]

ఉదా :—రాముడు - రాములు ; గురుడు - గురులు ; మగడు - మగలు.

5. బహువచనము పరమగునపుడు ఇకారాంతశబ్దముల ఇకారము ఉకారమగును.

ఉదా :— హరి - హరులు ; మతి - మతులు.

6. రెండక్షరముల శబ్దములును ర. ల. డ లు. ఉ. ప. థ లు. [కొనవర్ణమునకు ముందక్షరము] గాగల శబ్దములకునుదప్ప

ఇకార ముపాంత్యముగాఁగల తెనుఁగు శబ్దముల ఉపాంత్య ఇకారము ఉకారమగును.

ఉదా :—కలికి - కలుకులు.

రెండక్షరములు :—జిగి - జిగులు.
ర ఉపధ గల :—పందిరి - పందిరులు.
ల ,, :—పిడికిలి - పిడికిళులు.
డ ,, :—రాపిడి - రాపిడిలు.

7. ను వర్ణాంత శబ్దములు కొన్నిటికి బహువచనమందు బిందు పూర్వక కు వర్ణమగును.

ఉదా :—మ్రాను - మ్రాఁకులు, కెలను- కెలఁకు.

ఈ కు వర్ణమేకవచనమునందును వికల్పముగ వచ్చును.

ఉదా :—మ్రాను - మ్రాఁకు.

8. కొన్నియెడల బహువచనమునందు కడవర్ణకము లోపించును.

ఉదా :—చేను-చేలు, మీను-మీలు, పేను-పేలు, ఆయి-ఆలు మఱికొన్నిటి కిది వైకల్పికము.

ఉదా :—ఆవు- ఆవులు- ఆలు, జాము - జాములు - జాలు, చుట్టము - చుట్టములు - చుట్టలు.

9. దీర్ఘపూర్వకమగు లకార ముపధగాఁగల సంస్కృత సమ శబ్దములు బహువచనమగునపుడు రు వర్ణము వచ్చును.

ఉదా :—బాలుఁడు - బాలురు.

ఇట్లు కొన్ని తెనుఁగు శబ్దములకుఁగూడ వచ్చును.

ఉదా:—అల్లుఁడు-అల్లురు, పగతుఁడు - పగతురు.

10. బహువచనమందు డు. లు. టు. రు వర్ణముల ఉకారమునకు లోపము వైకల్పికముగనగును.

ఉదా:—డు: గుండు-గుండులు - గుండ్లు; కాలు- కాలులు కాళ్లు. టు: గొంటు - గొంటులు - గొంట్లు; గోరు- గోరులు - గోళ్లు.

11. కొన్ని శబ్దములకు బహువచనము లేదు.

ఉదా:—పైఁడి - వెండి - కేలు -మొన్న - రేపు-మాపు మొదలైనవి.

12. కొన్ని శబ్దములకేక వచనములేదు.

ఉదా:—ఇరులు - కురులు - వడ్లు - పెసలు.

బహువచనమున మఱికొన్ని భేదములు.

13. ము వర్ణాంత శబ్దములకు బహువచనము పరంబగునపుడు ము వర్ణలోపమును మీఁది హల్లునకు దీర్ఘము నగును.

ఉదా:—చుట్టము - చుట్టాలు, మీసము - మీసాలు.

| ఏకవచనము. | బహువచనము. | మఱియొకరూపము |
|---|---|---|
| విలుకాఁడు | విలుకాండ్రు | విలుకాఁడు |
| చెయువు | చెయువు | చెయువులు |
| చీటి | చీటులు | చీట్లు |
| తూఁడు | తూఁడులు | తూండ్లు |
| వజ్రము | వజ్రములు | వజ్రాలు |

| | | |
|---|---|---|
| పేరు | పేరులు, పేళులు | పేళ్లు |
| కొడవలి | కొడవండులు | కొడవండ్లు |
| త్రాడు | త్రాడులు | త్రాళ్లు |
| ఊరు | ఊరులు, ఊళులు | ఊళ్లు |
| తడి | తడులు | తళ్లు |
| విల్లు | విల్లులు, విండులు | విండ్లు |
| మొగిలు | మొగిళులు, మొగిలులు | మొగిళ్లు |
| ఏకి | బసాలు | |
| పెండ్లి | పెండ్లిండ్లు | |
| తేఁడు | తేండ్లు | |
| మఱదలు | మఱదండ్రు | |
| చెలియలు | చెలియండ్రు | |
| గండడు | గండండ్రు | |
| చెల్లెలు | చెల్లెండ్రు. | |

## VII. విభక్తులు (Case)

7\. విభక్తి :—నామవాచకములకుఁ గాని సర్వనామములకుఁ గాని వాక్యమునందలి యితరపదములతోఁగలసంబంధమును దెలుపు రూపములకు విభక్తియని పేర్లు.

ఇవి 1 ప్రథమా, 2 ద్వితీయా 3 తృతీయా 4 చతుర్థి 5 పంచమీ 6 షష్ఠీ 7 సప్తమీ అని యేడు విధములుగ నున్నవి.

పిలచుట కుపయోగించునది సంబోధన ప్రథమావిభక్తి యందురు,

| ప్రత్యయములు. | విభక్తులు. | |
|---|---|---|
| డు. ము. వు. లు. | ప్రథమావిభక్తి | Nominative case |
| ని. ను. ల. కూర్చి | ద్వితీయా ,, | Objective or accusative. |
| చేత-చే-తోడ-తో | తృతీయా ,, | Instrumental case |
| కొఱకు. కై | చతుర్థీ ,, | Dative case |
| వలన. కంటె. పట్టి. | పంచమీ ,, | Ablative case. |
| కి. కు. యొక్క. లో. లోపల. | షష్ఠీ ,, | Possessive or Genitive. |
| అందు. న | సప్తమీ ,, | Locative case. |

ఓ, ఓయి, ఓసి, ఓరి, అను ప్రత్యయములు ముందును అ, ఆ, ఆర, ఆరా, అను ప్రత్యయములు చివరను గలది సంబోధన ప్రథమా విభక్తి Nominative of address or Vocative.

1. సంబోధనంబున నేకవచనంబున నామంబు కడపటి ఉ కార మున క కారమగును.

ఉదా:—ఓరాముఁడ. ఓకృష్ణ.

2. సంబోధనంబున అకార, ఇకారముల దీర్ఘము వికల్పముగ నగును.

ఉదా:—రామ, రామా. హరి, హరీ. తండ్రి, తండ్రీ.

3. సంబోధనంబున ఓయాది ప్రత్యయములు వికల్పముగ లోపించును.

ఉదా:— ఓనెలంత, నెలంత; ఓయిచెలికాండ, చెలికాండ; ఓసిచెలీ, చెలి.

4. బహువచనంబున ద్వితీయాది విభక్తులు పరంబగునప్పుడు లువర్ణ ఉకారమున కకారమగును. ఉదా:—రాములను, రాములచేత, రాములయందు.

5. డు వర్ణకము వచ్చు పుంలింగములకును ఇ. ఈ. ఐ అంతమందుం గల పదములకును ఏకవచనమున నివర్ణమును తక్కిన వానికి నువర్ణమును వచ్చును.

ఉదా:—రామునిన్. హరినిన్. శ్రీనిన్. మైనిన్.

ను వర్ణము:— దొరను - విధాతను - వనమును.

6. నీ. మీ. లకుందక్క ఇ. ఈ ఐ. కారాంతముల ఏకవచసములందు కి వర్ణకము వచ్చును.

ఉదా:—హరికిన్ - మైకిన్ - శ్రీకిన్.

7. ఉకార ఋకారముల మీంద కు వర్ణమునకు నవర్ణమాగమ మగును.

ఉదా:—రామునకున్ - వనమునకున్.

8. అందు వర్ణకము పరమగుచో ఉకారఋకారములకు నవర్ణముపచ్చును. ఉదా:—వనమునందున్. విధాతృనందున్.

## 8. విభక్తుల యుపయోగములు.

1. ప్రథమావిభక్తి సకర్మక అకర్మక కర్తలయందును కర్మణికర్మలయందును, ఉపయోగింపఁబడును.

ఉదా:—సకర్మక:—రాముఁడు భూమిని పాలించెను.

అకర్మకకర్తకు:—చంద్రుఁడు ఉదయించెను.

కర్మణికర్మకు:—రామునిచే భూమి పాలింపఁబడియె.

2. ద్వితీయావిభక్తి ని, ను, ల ప్రత్యయములు కర్మకుపయోగింపబడును.

ఉదా:—రాముఁడు భూమిని పాలించెను.

3. తృతీయావిభక్తి చేత, చే ప్రత్యయములు కర్మణికర్తకు హేతుకరణంబులకు గ్రహాది యోగంబగు పంచమికి నుపయోగింపబడును.

ఉదా:—కర్మణికర్తకు:—దేవదత్తునిచేత వంటకము వండఁబడియె.

హేతువు:—ధనముచేత సౌఖ్యముగలుగును.

కరణము:—కత్తిచేతనఱికెను.

గ్రహాదియోగము:—ఈ యర్థము నీచేత నెఱిఁగితి.

4. తృతీయా విభక్తి తోడ, తో ప్రత్యయములు కరణసహాయార్థతుల్యార్థ వచ్యర్థములకు నుపయోగింపఁబడును.

ఉదా:—కరణ:_కోలతోడఁ గూలనేసెన్.

సహార్థము:—రాజు సేనలతోడ వచ్చెను.

తుల్యార్థము:_చైత్రునితోడ మైత్రుఁడు [తుల్యుఁడు.

వచ్యర్థము:_చైత్రుఁడు మైత్రునితో నిట్లనెను.

5. చతుర్థీవిభక్తి, కొఱకు, కై ప్రత్యయములు సంప్రదానంబు నకును, ఉద్దేశ్యమాత్రంబునకు నుపయోగింపఁబడును.

ఉదా:—సంప్రదానమునకు:—జనకుఁడు రామునికొఱకుఁ గన్యనిచ్చెను.

ఉద్దేశము:-పురుషార్థముకొఱకుయత్నింపవలయును.

6. చతుర్థీవిభక్తికిమాఱు షష్ఠి తఱచుగా వచ్చును.

7. పంచమీవిభక్తివలన అపాయము, భయము, గ్రహణము, భవము మొదలగువాని కుపయోగింపబడును.

ఉదా:—అపాయము:-వాడు రాజ్యమువలన భ్రష్టుడయ్యెను.

భయము:—చోరునివలన భయపడెను.

గ్రహణము:—భృత్యునివలన కప్పముఁగొనియెను.

భవము-పుట్టుట:—మనువువలన ప్రజలుపుట్టిరి.

8. పంచమీవిభక్తికంటె ప్రత్యయము అన్యదూరసమీపాదు లకును, నిర్ధారణమునకును నుపయోగింపఁబడును.

ఉదా:_అన్యము:_రామునికంటె నన్యుఁడు ధర్మపరుఁడు లేఁడు.

దూరము:_ఇీనికంటె దూరము.

సమీపము:—దానికంటె నిది సమీపము.

నిర్ధారణము:—శరీరబలముకంటె బుద్ధిబలము ఎక్కుడు.

9. పట్టిప్రత్యయము హేతువులగు గుణక్రియలకు వచ్చును.

ఉదా:—జ్ఞానముంబట్టి ముక్తివచ్చును. నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నైతిని.

10. షష్ఠీవిభక్తియొక్క కి కు ప్రత్యయములు సంబంధమున కుపయోగింపఁబడును.

ఉదా:—వానికిఁ దమ్ముఁడు- నాకునెచ్చెలి- రామునియొక్క గుణములు.

11. లోపల ప్రత్యయము నిర్ధారణ కుపయోగింపఁబడును.

ఉదా:—రాజులలోపల రాముఁడు త్తముఁడు

మనుష్యులలో క్షత్త్రియుఁడు శూరుఁడు.

12. సప్తమీవిభక్తి అందు, ఇందు, న ప్రత్యయములుఆధారమునకు వచ్చును. (ఆధారము 1 ఔపశ్లేషికము 2 వైషయికము 3 అభివ్యాపకము అని మూఁడువిధములు)

ఉదా:—ఔపశ్లేషికము:—ఘటమునందు జలమున్నది.

వైషయికము:—మోక్షమునం దిచ్ఛగలదు.

అభివ్యాపకము:—అన్నింటియం దీశ్వరుఁడు గలఁడు.

13. ఉకారాంత జడవాచకమునకు నవర్ణకము వచ్చును.

ఉదా:—ఘటమున జలమున్నది. మోక్షముననిచ్ఛగలదు.

14. సంబోధనమునందు స్త్రీలింగముల ఏకవచనము తుదను రో, రో అను వర్ణకము వైకల్పికముగాఁ జేర్చఁబడును.

ఉదా:—అమ్మనో, అమ్మరో, అక్కరో, అక్కరో.

ఉకారాంత పుంలింగము, మగఁడు శబ్దము.

| | ఏకవచనము | బహువచనము. |
|---|---|---|
| ప్రథమా విభక్తి. | మగఁడు. | మగలు |
| సంబోధన ప్రథమా, | ఓమగఁడ, ఓమగఁడా, ఓయిమగఁడ, ఓయిమగఁడా ఓరిమగఁడ, ఓరిమగఁడా ఓరిమగఁడ, ఓరీమగఁడా | ఓమగలార, ఓమగలారా. |
| ద్వితీయావిభక్తి | మగనిన్, మగనిని మగనిఁగూర్చి, మగనిగురించి | మగలన్, మగలను, మగలఁగూర్చి, మగలను గురించి, మగలగురించి |
| తృతీయా ,, | మగనిచేతన్, మగనిచేఁ, మగనితోడన్, మగనితోన్ | మగల చేతన్, మగల చేన్, మగల తోడన్, మగలతోన్, |
| చతుర్థి ,, | మగనికొఱకున్ మగనికై, | మగలకొఱకున్, మగలకై. |
| పంచమీ ,, | మగనివలనన్, మగనికంటెన్, మగనిఁబట్టి | మగలవలనన్, మగల కంటెన్, మగలఁబట్టి. |
| షష్ఠీ ,, | మగనికిన్, మగని యొక్క | మగలకున్, మగల యొక్క, మగలలోన్, మగల లోపలన్ |
| సప్తమీ ,, | మగనియందున్ | మగలయందున్ |

## వృద్ధ శబ్దము.

ప్ర. వృద్ధు వృద్ధుఁడు, వృద్ధులు.

సం. ప్ర. ఓవృద్ధు, ఓవృద్ధూ, ఓవృద్ధుఁడ,
ఓవృద్ధుఁడా, ఓయివృద్ధు, ఓయివృద్ధూ,
ఓయివృద్ధుఁడ, ఓయి వృద్ధుఁడా, ఓవృద్ధులార,
ఓయీవృద్ధుఁడ, ఓయీవృద్ధుఁడా, ఓవృద్ధులార,
ఓరివృద్ధు, ఓరివృద్ధూ, ఓరివృద్ధుఁడ, వృద్ధులార,
ఓరివృద్ధుఁడా, ఓరీవృద్ధు, ఓరీవృద్ధూ,
ఓరీ వృద్ధుఁడ ఓరీ వృద్ధుఁడా
వృద్ధు, వృద్ధూ,
వృద్ధుఁడ, వృద్ధుఁడా.

ద్వి. వి. వృద్ధునిన్, వృద్ధున్, వృద్ధునిఁ వృద్ధులన్, వృద్ధులఁ
గూర్చి వృద్ధుఁగూర్చి వృద్ధుని గూర్చి, వృద్ధులను
గుఱించి వృద్ధుఁగుఱించి గూర్చి, వృద్ధుల
గురించి వృద్ధులనుగురించి

తృ. వి. వృద్ధుచేత, వృద్ధునిచేత, వృ వృద్ధులచేతన్, వృ
ద్ధుచేన్, వృద్ధునిచేన్, వృద్ధు ద్ధులచేన్, వృద్ధుల
తోడన్, వృద్ధునితోడన్, తోడన్, వృద్ధులతోన్,
వృద్ధుతోన్, వృద్ధునితోన్.

(శేషమూహింపఁదగినది.)

సీత.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. వి. | సీత | సీతలు |
| సం ప్ర. వి. | ఓ సీత, ఓసీతా, ఓసి సీత ఓసి సీతా, ఓసీ సీత, ఓసీ సీతా, సీతరో, సీతకో, సీత, సీతా. | ఓ సీతలార, ఓసీతలారా, సీతలార, సీతలారా. |
| ద్వి. వి. | సీతను, సీతఁగూర్చి, సీతను గూర్చి, సీతఁగురించి, సీతను గురించి. | సీతల, సీతలఁ, సీతల గూర్చి, సీతలను గూర్చి, సీతలఁగురించి, సీతలనుగురించి. |

## V సమాసములు. (Cam pounding words)

సమాసము:—పదముల అర్థసంబంధమును దెలిపెడి విభక్తి ప్రత్యయములు మొదలైనవి లోపించుట సమాసమనఁబడును.

ఉదా:—రాజు యొక్క పురుషుఁడు=రాజపురుషుఁడు.

(2) సిద్ధసాధ్యభేదములు.

2. సమాసములు 1 సిద్ధము లేక సాంస్కృతికము 2 సాధ్యము లేక మిశ్రము 3 ఆచ్ఛికము అనిమూఁడు విధములు.

1. సిద్ధము లేక సాంస్కృతికము:— కేవల సంస్కృత పదములు సమసించుటచేనేర్పడును.

ఉదా?—తటాకోదకము.

2. సాధ్యము లేక మిశ్రము:—తత్సమములను అచ్చ తెలుఁగు పదములను సమసించుటచే నేర్పడును.

ఉదా:—తటాకంబునీరు.

3. అచ్ఛికము:— కేవలము తెలుఁగుపదములు సమసించుటచే నేర్పడును. ఉదా:— చెఱువునీరు.

3. ఇవి. 1 తత్పురుషము 2 కర్మధారయము 3 బహువ్రీహి 4 ద్వంద్వము 5 ద్విగు మొదలగు భేదములతో నుండును.

1. తత్పురుషము (Different Government):—సమసించు రెండు పదములలో రెండవ (ఉత్తర) పదము యొక్క అర్థము ప్రధానముగాఁగలది.

ఉదా:— రాజ పురుషుఁడు.

ఇవి విభక్తి ప్రత్యయముల వలన ద్వితీయా 2 తృతీయా 3 చతుర్థీ 4 పంచమీ 5 షష్ఠి 6 సప్తమీ 7 నఞ్ అను భేదములతో నొప్పును.

1. ద్వితీయా తత్పురుష:—కృష్ణుని శ్రితుఁడు = కృష్ణశ్రితుఁడు.
2. తృతీయాతత్పురుష:—నెలచే + తక్కువ = నెలతక్కువ.
మాసపూర్వుఁడు, మాసముచే + పూర్వుఁడు.
3. చతుర్థీతత్పురుష:—దేవఱకొఱకు మేలు = దేవర మేలు
4. పంచమీ తత్పురుష:—చోరునివలన భయము = చోరభయము.

5. షష్ఠీతత్పురుష:—రామునియొక్క గుణములు = రామ గుణములు.

6. సప్తమీతత్పురుష:—మాటయందు నేర్పరి=మాటనేర్పరి.

7. నఙ్ తత్పురుష (Negative Sense):—అన్యాయము, అజ్ఞానము. (కాని యనునర్థమిచ్చు ప్రత్యయముగలది.)

2. కర్మధారయసమాసము(Descriptive Compounds):—సంఖ్యావాచకము కానివిశేషణమునకు విశేష్యము (నామవాచకము) తో సమసించునది.

ఉదా:—సరసము + వచనము = సరసవచనము, దంటమాట. ఇది 1 విశేషణపూర్వపదము 2 విశేష్యపూర్వపదము 3 విశేషణోభయపదము 4 సంభావనా పూర్వపదము 5 ఉపమానపూర్వపదము 6 ఉపమానోత్తరపదము 7 మధ్యమపదలోపము; మొదలైన భేదములు గలిగి యుండును.

1. విశేషణ పూర్వపదము:—తెల్లగుడ్డ.

2. విశేష్యపూర్వపదము:—వైయాకరణఖసూచి.

3. విశేషణోభయపదము:—శీతోష్ణప్రదేశము.

4. సంభావనాపూర్వపదము:—ముఖపద్మము= ముఖము అను పద్మము - దీనిని రూపకసమాసమందురు.

5. ఉపమాన పూర్వపదము:—చంద్ర సుందరము, చిగురుమోవి.

6. ఉపమానోత్తర పదము:—హస్త పద్మము, కేలుదమ్మి.

7. మధ్యమ పదలోపము - ఛాయాద్రుమము - జవ్వాజిసెట్టి.

బహువ్రీహిసమాసము:— (Attributive Gompounds) సమాసములోని రెండు పదముల యర్థముగాక యితర పదార్థము ప్రధానముగాఁ గలది.

ఉదా:—శీతకిరణములు గలవాఁడు - శీతకిరణుఁడు.

4. ద్వంద్వ సమాసము:—(Couplative Compounds) సమసించు రెండుపదముల యర్థమును ప్రధానముగాఁ గలది.

ఉదా:—రామలక్ష్మణులు.

ఇది 1 ద్విపద ద్వంద్వము 2 బహుపద ద్వంద్వము - అని రెండు విధములు.

1. ద్విపద ద్వంద్వము:—రెండు పదములు సమసించినది.
ఉదా:—రామలక్ష్మణులు, కూరగాయలు.

2. బహుపదద్వంద్వము:-అనేక పదములు సమసించినది.
ఉదా:—రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు.

5. ద్విగు సమాసము:—(Numera Compounds) విశేషణము సంఖ్యా వాచకముగలది.

ఉదా:—ముక్కాలు, మూఁడు కాళులు,

నలుకడలు, నాలుగుకడలు.

సమాసములు: 1 లుక్సమాసము 2 అలుక్సమాసము అని రెండు విధములు.

1. అలుక్సమాసము:—విభక్తి ప్రత్యయములు గలది.

ఉదా:—వనేచరుఁడు, నాతోడిచెలిమి.

2. లుక్సమాసము:— చివరవిభక్తి ప్రత్యయములు లేనిది.

ఉదా:—వృక్షమూలము.

---

## VI. క్రియలు (Verbs)

క్రియలు(Kinds of action):— వ్యాపారమును దెలుపు నట్టి పదములు క్రియలనఁబడును.

ఉదా:—పోషించు, కొట్టు.

ధాతువుల (Roods) కొనయందు ఉకారముండును.

ప్రత్యయములతోఁ గూడకమునుపు క్రియకు ధాతువని పేరు.

ఉదా:—కొట్టు, చేయు, చూచు.

ఇవి 1. తత్సమక్రియలు. 2. దేశ్యక్రియలు. అని రెండు విధములు.

1. తత్సమక్రియల యంతమందు ఇంచు ప్రత్యయముండును.

ఉదా:—సేవించు, పోషించు.

2. ఈ ఇంచు ప్రత్యయము కొన్ని దేశ్యక్రియలకుఁ గానఁబడుచున్నది.

ఉదా:—అవులించు, ఆరగించు, పరికించు.

3. కొన్ని తత్సమక్రియల యంతమందు ద్విరుక్తలకార ముండును.

ఉదా:—భాసిల్లు, రంజిల్లు, వర్ధిల్లు.

4. గురువులేనట్టియు, యకారాంతములు కానట్టియు ధాతువుల కొకటి రెండచ్చులుగలవానికి వికల్పముగా నించునకు బూర్వమున ఇ య్ ఆగమమగును.

ఉదా:—భుజించు, భుజియించు, గుణించు, గుణియించు.

5. క్రియలన్నియు (1) సకర్మకములు. (2) అకర్మకములు అని రెండువిధములుగా నుండును.

1 కర్మమునుగోరునవి సకర్మకములు. (Transitive)

(కర్మము. ధాతువువలన గలుగు ఫలమును పొందునది)

ఉదా:—బాలుఁడు పాఠమును చదువుచున్నాఁడు.

2 కర్మను గోరనివి అకర్మకములు (Intransitive.)

ఉదా:—పిల్లవాఁడు పరువెత్తుచున్నాడు.

6. సకర్మకములు 1 కర్త్రర్థకప్రయోగము 2 కర్మార్థకప్రయోగము అని రెండు విధములు.

1 కర్త్రర్థకప్రయోగము:—కర్తప్రథమా విభక్తియందుండునది. ఉదా:—ఉపాధ్యాయుఁడు బాలుని శిక్షించెను.

(కర్తయనఁగా క్రియయొక్క వ్యాపారము చేయువాడు)

కర్మము: ప్రథమావిభక్తిగా నుండునది కర్మార్థకము.

ఉదా:—బాలుఁడుపాధ్యాయునిచే శిక్షింపఁబడెను.

7. క్రియలన్నియు 1 సమాపకములు 2 అసమాపకములుఅని రెండువిధములై యుండును.

1. సమాపకము(Finite):—ముగిసిన (పూర్తియైన)
ఉదా:—కొట్టుచున్నాను, చేసెను.
క్రియలు

2. అసమాపకము (Infinite) :—ముగియని (పూర్తిగాని) క్రియలు. ఉదా: కొట్టి, చేసి.

సమాపకక్రియలు (Finite verbs)

క్రియలకు 1 వర్తమానకాలము 2 భూతకాలము 3 భవిష్యత్కాలము 4 తద్ధర్మార్థకాలము అని నాలుగు విధములుగానుండును.

1. వర్తమానకాలము Present:—ఇప్పుడు జరుగుచున్న కాలమును దెలుపును.

ఉదా:—చేయుచున్నాఁడు, కొట్టుచున్నాడు.

2. భూతకాలము Past:—జరిగిపోయినకాలమును దెలుపును.
ఉదా:—చేసెను, కొట్టెను, పోయెను.

3. భవిష్యత్కాలము Future:—ముందు జరుగబోవు కాలమును దెల్పును.

ఉదా:—చేయఁగలఁడు; పోఁగలఁడు.

4. తద్ధర్మకాలము Indifinite:—పై మూఁడు కాలములయందు నొక్కటిగానుండు స్వభావమును దెపును.

ఉదా:—పురుగులు పాకును, చేపలు ఈదును.

8. కర్తలను బట్టి క్రియలకు 1 ప్రథమ 2 మధ్యమ 3 ఉత్తమ పురుషములు గలవు.

1. ప్రథమపురుషము First person:—ప్రథమపురుష సర్వనామముగాని, నామవాచకముగాని కర్తకాఁగలది.

ఉదా:—వాఁడు వచ్చెను, రంగఁడు రాగలఁడు.

2. మధ్యమపురుషము Second person:—మధ్యమ పురుష సర్వనామముగాని నామవాచకముగాని కర్తగాఁగలది.

ఉదా:—నీవు వచ్చితివి, ఈరంగఁడు రాఁగలఁడు.

3. ఉత్తమపురుషము Third person:—ఉత్తమపురుష సర్వనామము కర్తగాఁగలది.

ఉదా:—నేను వచ్చితిని.

9. ప్రథమపురుషమునతప్పలింగభేదములేదు. ప్రతిపురుషమునకును ఏకవచన బహువచన భేదముండును.

ప్రథమ - పుం. వాఁడువచ్చెను. స్త్రీ. అది వచ్చెను. న. అదివచ్చెను.

10. అర్థము ననుసరించి క్రియలు భావము, వ్యతిరేకము అని రెండు భేదములు. (వ్యతిరేకమనఁగా క్రియ యొక్క అభావము)

ఉండు ధాతువు — వర్తమానకాలము.

| పురుష | లింగము | ఏకవచనము | బహువచనము |
| --- | --- | --- | --- |
| ప్రథమ | పుం | ఉన్నాఁడు | ఉన్నారు. |

| | | | |
|---|---|---|---|
| ,, | స్త్రీ | ఉన్నది | ఉన్నారు. |
| ,, | న | ఉన్నది | ఉన్నవి. |
| మధ్యమ. | | ఉన్నావు | ఉన్నారు. |
| ఉత్తమ. | | ఉన్నాను | ఉన్నాము. |

ఈ క్రియ యింతవఱకే యుపక్రియగా నుపయోగింపఁబడును.

3. కలుగు ధాతువు - వర్తమానకాలము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | పుం. | కలఁడు | కలరు. |
| ,, | స్త్రీ. | కలదు | కలరు. |
| ,, | . | కలదు | కలవు. |
| మధ్యమ | | కలవు | కలరు |
| ఉత్తమ | | కలను | కలము |

ఇంతవఱకే యుపక్రియగా నుపయోగింపఁబడును.

(1) సమాపక రూపములు.

3. పడు ధాతువు.

స్వార్థము-భావము- వర్తమానకాలము.

| పురుష | లింగము. | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| ప్రథమ. | పుం. | పడుచున్నాఁడు. | పడుచున్నారు |
| ,, | స్త్రీ. | పడుచున్నది. | పడుచున్నారు. |
| ,, | న. | పడుచున్నది. | పడుచున్నవి. |
| మధ్యమ. | | పడుచున్నావు. | పడుచున్నారు. |
| ఉత్తమ. | | పడుచున్నాను. | పడుచున్నాము. |

భూతకాలము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | పుం. స్త్రీ. | పడియెను—పడెను. | పడిరి. |
| " | న | పడియెను, పడెను. | పడియెను,పడెను |
| మధ్యమ. | | పడితివి, పడితి. | పడితిరి. |
| ఉత్తమ. | | పడితిని. | పడితిమి. |

భవిష్యత్కాలము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | పుం. | పడఁగలఁడు. | పడఁగలరు. |
| " | స్త్రీ. | పడగలను. | పడఁగలరు. |
| " | న. | పడఁగలదు | పడఁగలవు. |
| మధ్యమ. | | పడఁగలవు. | పడఁగలరు. |
| ఉత్తమ. | | పడఁగలవు. | పడగలరు. |

తద్ధర్మము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | పుంస్త్రీ | పడును. | పడుదురు. |
| ,, | న | పడును. | పడును |

మధ్యమ పడుదువు పడుదు పడుదురు.

మధ్యమ పడుదువు పడను పడుదురు.

తద్ధర్మము . రూపాంతము

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | పుం. స్త్రీ. | పడియెడును, పడెడును | పడియెదరు. |
| ,, | | పడియెడిని, పడెడిని. | పడెదరు. |
| ,, | న | పడియెడును పడెడును. | పడియెడునుపడెడును. |
| | | పడియెడిని, పడెడిని | పడెడిని పడియెడిని |

| | | |
|---|---|---|
| మధ్యమ | పడియెదవు, పడెదవు. | పడియెదరు. |
| | పడియెదు, పడెదు. | పడెదరు. |
| ఉత్తమ. | పడియెదను, పడెదను. | పడియెదము, పడెదము. |

వ్యతిరేకము-తద్ధర్మము-

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | పుం. | పడడు. | పడరు. |
| ,, | స్త్రీ | పడదు. | పడవు. |
| | న | పడదు. | పడవు. |
| మధ్యమ. | | పడవు. | పడరు. |
| ఉత్తమ. | | పడను. | పడము |

(8) 1. ఆత్మనే పదార్థము:—క్రియఫలము కర్తను జెందినపు డేర్పడును. ధాతువు చివరన కొను ధాతువు చేర్చుటచే నేర్పడును. (అప్పుడు ధాతువు కొనయందలి ఉకారమునకు ఇకారము వైకల్పికముగ నగును.)

ఉదా:—పోషించుకొను - పోషించికొను.

కొట్టుకొను - కొట్టికొను.

(క) ఆత్మనేపద కర్త్రర్థకము:—

ఉదా:— పోషించుకొనుచున్నాఁడు - పోషించి కొనుచున్నాఁడు—పోషించుకొని – పోషించికొని.

(గ) ఆత్మనే పద కర్మార్థకము:—

ఉదా:—పోషించుకొనఁబడుచున్నాఁడు – పోషించుకొనఁబడుచున్నాఁడు. పోషించుకొనఁబడి – పోషించికొనఁబడి.

2. (క) ప్రేరణకర్త్రర్థకము:—

ఉదా:—పోషించుచున్నాఁడు - పోషింపించి.

(గ) ప్రేరణకర్మార్థకము:—

ఉదా:—పోషింపఁబడుచున్నాఁడు - పోషింపింపఁబడి.

(చ) ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము:—

ఉదా:—పోషింపించుకొనుచున్నాఁడు - పోషింపించికొను చున్నాఁడు. పోషింపించుకొని - పోషింపించికొని.

(జ) ప్రేరణాత్మనేపద కర్మార్థకము:—

ఉదా:—పోషింపించుకొనఁబడుచున్నాఁడు - పోషింపించికొనఁబడుచున్నాఁడు. పోషింపించుకొనఁబడి - పోషింపించికొనఁబడి.

3. న్యూనక్రియలు:—(Defective Verb) 1. కొన్ని కాలములయందును పురుషములందును మాత్ర ముపయోగింపఁబడునవి.

ఉదా:—ఒల్లఁడు, వలయును.

2. ఒల్లఁడు దీనికి వ్యతిరేకమునందే కాని భావమునఁ బ్రయోగము లేదు. ఇట్లేవలయును, వలెను, వలదు, కూడును, కూడదు.

3. ప్రార్థనార్థకము (Imperative Mood.)

7. (క) ధాతువుతుదను ప్రథమపురుష ఏకవచన బహువచనములందు క్రమముగా ము, ఁడు వర్ణకములు చేర్చుటవలన

ప్రార్థనార్థక మేర్పడును.

ఉదా:—పోషింపుము, పోషింపుఁడు, కొట్టుము, కొట్టుఁడు.

(చ) ప్రార్థనార్థకమునందు అ-ఆ-ఇ-ఈ లు వైకల్పికముగ నగును.

ఉదా:—పోషింపుమ, పోషింపుమా, కొట్టుమి, కొట్టుమీ, పోషింపుఁడ, పోషింపుఁడా, పోషింపుఁడి, పోషింపుఁడీ.

(ట) వ్యతిరేకార్థక మధ్యమపురుషమునకు ఎ, ఏ, ఒ, ఓ, అయ్య, అమ్మ, చేర్చుటవలనఁగూడ ప్రార్థనార్థక మగును.

ఉదా:—పోషింపవె, పోషింపవే; పోషింపవొ, పోషింపవో; కొట్టరె, కొట్టరే, పోషింపరయ్య, కొట్టరమ్మ.

(త) ధాతువు తుదను దము చేయుటవలన ఉభయకర్తృక ప్రార్థనార్థక మేర్పడును.

ఉదా:—పోషింపుదము, పోషింతము.

(ప) మధ్యమపురుష ఏకవచన బహువచనములయందుఁ గ్రమముగా కుము, కుఁడు వర్ణకములు తుమున్నర్థక రూపము తుదను జేయుటవలన వ్యతిరేకప్రార్థనార్థకము ఏర్పడును. (దుత్రము లోపించును.)

ఉదా:—పోషింపకుము, కొట్టకుము, పోషింపకుఁడు, కొట్టకుఁడు.

## 4. ఆశీరర్థకము — Precative Mood.

8. (క) ధాతువు తుదను ఎడు, తె వర్ణకములు చేరుట వలన ఆశీరాద్యర్థకము ఏర్పడును.

ఉదా:—పోషించెదుగా, కొట్టుతన్, పోషించుతన్, కొట్టెదుగా.

(చ) తదర్థార్థకము తుదను కాతగా, కావుతగా కాకగా వీనిని చేర్చుటవలనను ఆశీరర్థక మేర్పడును.

ఉదా:—పోషించుఁగాతగా, పోషింతురుకావుతగా, కొట్టుదురుగాక.

9. క్రియాపదంబులమీఁద ఆ, ఏ వర్ణకములు చేరుటచే ప్రశ్నార్థక మేర్పడును.

ఉదా:—వానిని బోషించితివా ? వారు కొట్టిరే ?

10. క్రియాపదంబులమీఁద ఒ, ఓ, వర్ణకములు చేరుటచే సందేహార్థమగును.

ఉదా:—కొట్టునో, కొట్టుఁడో.

### (5) పరస్మైపదములు.

ఆత్మనేపదములకు వ్యతిరిక్త మైనవి. ఉదా:—వంచుచున్నాడు.

| పురుషము. | కర్త్రర్థకములు. | మఱొక కర్తనుబోధించు కర్మార్థకములు. |
|---|---|---|
| ఉత్తమ. | వండఁబడుచున్నాను. | వండింపఁబడుచున్నాను |
| | వండఁబడుచున్నాము | వండింపఁబడుచున్నాము |

| | | |
|---|---|---|
| మధ్యమ. | వండబడుచున్నావు. | వండింపఁబడుచున్నావు. |
| | వండఁబడుచున్నారు. | వండింపఁబడుచున్నారు. |
| ప్రథమ | వండబడుఁచున్నాఁడు. | వండింపఁబడుచున్నాఁడు. |
| | వండఁబడుచున్నది. | వండింపఁబడుచున్నది. |
| | వండఁబడుచున్నారు. | వండింపఁబడుచున్నారు. |
| | వండఁబడుచున్నది. | వండింపబడుఁచున్నది. |

అకర్మకక్రియలు కొన్ని ప్రేరణమున సకర్మకములై పరస్మైపది ఆత్మనేపదులుంగు కర్తృకర్మార్థభేదంబులచే వ్యవహరింపఁబడును.
ఉదా:—తిరుగు ధాతువు.

| పరస్మైపది | ఆత్మనేపది. |
|---|---|
| త్రిప్పుచున్నాఁడు. | త్రిప్పుకొనుచున్నాఁడు. |
| త్రిప్పించుచున్నాఁడు. | త్రిప్పించుకొనుచున్నాడు. |
| త్రిప్పఁబడుచున్నది. | త్రిప్పుకొనఁబడుచున్నది. |
| త్రిప్పించఁబడుచున్నది. | త్రిప్పించుకొనఁబడుచున్నది. |

3. ధాత్వర్థకములు.

1. పడుట:—ధాత్వర్థకము- 2. పడమి:—వ్యతిరేక ధాత్వర్థకము (స్వతంత్రక్రియయైనప్పుడు గూడ నీరూపములే వచ్చును.)

4. కొను ధాతువు.

సమాపకము - స్వార్థము - భావము.

| పురుష. లింగము. | ఏకవచనము | బహువచనము. |
|---|---|---|
| ప్రథమ పుం. | కొనుచున్నాఁడు | కొనుచున్నారు |
| | కొన్చున్నాఁడు | కొన్చున్నారు. |
| | కొంచున్నాఁడు | కొంచున్నారు. |

| | | |
|---|---|---|
| స్త్రీ | కొన్చున్నది | కొన్చున్నారు |
| | కొనుచున్నది | కొనుచున్నారు |
| | కొంచున్నది | కొంచున్నారు |
| న | కొనుచున్నది కొన్చున్నది, | కొనుచున్నవి కొన్చున్నవి |
| | కొంచున్నది | కొంచున్నవి |
| మధ్యమ | కొనుచున్నావు | కొనుచున్నారు |
| | కొన్చున్నావు | కొన్చున్నారు |
| | కొంచున్నావు | కొంచున్నారు |
| ఉత్తమ | కొనుచున్నాను | కొనుచున్నాము |
| | కొన్చున్నాను | కొన్చున్నాము |
| | కొంచున్నాను | కొంచున్నాము |

భూతకాలము.

| | | |
|---|---|---|
| ప్రథమ పుం. స్త్రీ | కొనియెను - కొనెను | కొనిరి |
| న | కొనియెను - కొనెను | కొనియెను-కొనెను |
| మధ్యమ | కొంటివి - కొంటి | కొంటిరి |
| ఉత్తమ | కొంటిని | కొంటిమి |

భవిష్యత్కాలము.

| పురుషము | లింగము | ఏకవచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ | పుం | కొనఁగలఁడు | కొనఁగలరు |
| ,, | స్త్రీ | కొనఁగలరు | కొనఁగలరు |

| | | | |
|---|---|---|---|
| ,, | న | కొనఁగలరు | కొనఁగలవు |
| మధ్యమ | | కొనఁగలవు | కొనఁగలరు |
| ఉత్తమ | | కొనఁగలను | కొనఁగలము |

తద్ధర్మము.

ప్రథమ పుం స్త్రీ కొనును కొనుదురు కొందురు, కొందురు,
కొందురు, కొందురు.

న కొనును కొనును

మధ్యమ కొనుదువు కొందువు కొనుదు } కొనుదురు కొం
కొందు కొందు కొందువు } దురు కొందురు.
కొందురు కొందురు

ఉత్తమ కొనుదును కొందును కొనుదుము కొందుము.
కొందును కొందుము

తద్ధర్మము, రూపాంతరము.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమ | పుం స్త్రీ | కొనియెదును | కొనెదును | కొనియెదరు |
| | | కొనియెడిని | కొనెడిని | కొనెదరు |
| | న | కొనియెడును | కొనెడును | కొనియెడును |
| | | కొనియెడిని | కొనెడిని | కొనెడును |
| మధ్యమ | | కొనియెదవు | కొనెదవు | కొనియెదరు |
| | | కొనియెదు | కొనెదు | కొనెదరు |
| ఉత్తమ | | కొనియెదను | కొనెదను | కొనియెదము, |
| | | | | కొనెదము. |

### వ్యతిరేక తద్ధర్మము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | పు॥ | కొనఁడు | కొనరు |
| | స్త్రీ | కొనదు | కొనరు |
| | న | కొనదు | కొనవు |
| మధ్యమ | | కొనవు | కొనరు |
| ఉత్తమ | | కొనను | కొనము. |

### ప్రార్థనార్థకము 1 భాగము.

మధ్యమ కొనుము, కొమ్ము కొనుఁడు, కొండు.

ఉభయకర్తృకము కొనుదము, కొందము. కొందము

### 2 వ్యతిరేకము.

మధ్యమ కొనకుము, కొనకు. కొనకుఁడు

ఆశీరాద్యర్థకము. కొనియెదును, కొనెదును, కొనుతను.

### 4 స్వతంత్రక్రియలు.

1. ఇంచు అంతమందుఁ గల ధాతువులకు వర్తమానార్థకము, భవిష్యదర్థకము, ప్రార్థనార్థకము, వ్యతిరేకార్థకము, తుమున్నర్థకము, ప్రేరణార్థకము మొదలైనవి పరంబులగునపుడు చకారమునకు పకారమగును.

ఉదా:_పోషించు, పోషింపుచున్నాఁడు, పోషింపఁగలడు, పోషింపుము, పోషింపకు, పోషింపన్, పోషింపించు మొదలైనవి.

2. ధాతువుయొక్క శత్రర్థక రూపమునకు తుదనుఉండు ధాతువుయొక్క వర్తమాన కాలరూపములను జేర్చుట వలన వర్తమానకాల మేర్పడును.

ఉదా:—పోషించుచున్నాఁడు, పోషించుచున్నాను, పోషించుచున్నారు.

3. (క) ప్రథమపురుష ఏకవచన నపుంసకలింగ బహువచనములందు ధాతువుతుదను ఎను వర్ణకము చేర్పఁబడిన భూతకాలమగును.

ఉదా:—పోషించెను.

(చ) మధ్యమపురుష ఏకవచన బహువచనములందు క్రమముగా తివి, తిరి వర్ణకములు చేరినభూతకాలమేర్పడును.

ఉదా:—పోషించితివి, పోషించితి, పోషించితిరి.

(ట) ఉత్తమపురుష ఏకవచన బహువచనములందు క్రమముగా తిని, తిమి వర్ణకములుచేరిన భూతకాలమేర్పడును.

ఉదా:—పోషించితిని, పోషించితిమి.

(క్త్వార్థకరూపము తుదను భూతకాలమున పైమార్పులగును)

4. ధాతువుయొక్క తుమున్నర్థక రూపము తుదనుగలుగు ధాతువుయొక్క వర్తమాన కాలరూపములను చేర్చుట వలన భవిష్యత్కాల మేర్పడును.

ఉదా:— పోషింపఁగలఁడు, పోషింపగలరు, కొట్టఁగలడు, కొట్టఁగలరు.

౫. (క) ధాతువు చివరను ప్రథమ పురుష ఏకవచన నపుంసక లింగ బహువచనములందు నువర్ణకమును, రూపాంతరమునందు దుత్వసహితములగు ఎను, ఎడి వర్ణకములను, పుంలింగ స్త్రీలింగ బహువచనములందు దురు వర్ణకమును, రూపాంతరమునందు ఎదరు వర్ణకములును జేరుటవలన తద్ధర్మకాల మేర్పడును.

ఉదా:— పోషించును - పోషించెదున్ - పోషించెడిన్. పోషింపుదురు-పోషించెదరు - పోషించుదురు.

(చ) ధాతువు తుదను మధ్యమ పురుష ఏకవచన బహువచనములందు క్రమముగా దువు, దురువర్ణకములును రూపాంతరమునందు ఎదవు, ఎదరు వర్ణకములును జేరుటవలన తద్ధర్మకాల మేర్పడును.

ఉదా:—పోషింపుదువు - పోషింపుదురు. పోషించెదవు-పోషించెదరు.

(ట) ధాతువు తుదను ఉత్తమ పురుష ఏకవచన బహువచనములందు క్రమముగా దును, దుమువర్ణకములును, రూపాంతరమందు ఎదను, ఎదము వర్ణకములును చేరుటచే తద్ధర్మ కాలమేర్పడును.

ఉదా:—పోషించుదును, పోషించుదుము. కొట్టెదను, కొట్టెదము.

(త) మధ్యపురుష వువర్ణము వైకల్పికముగా లోపించి తుది అకారము కారమగును.

ఉదా:—కొట్టుదు

(ప) ఇంచునకు న వర్ణము పరమగునపుడు వైకల్పికముగ చు వర్ణము లోపించి నకారమునకు తకారమును రు వర్ణము పరమైన వైకల్పికముగ ఉకారలోపమును నగును.

ఉ:—పోషింతురు-నిందింతురు.

6. (క) తుమున్నర్థక రూపముతుదను ప్రథమ పురుష ఏకవచనమున పుంలింగమందు డు వర్ణకమును స్త్రీ లింగ నపుంసక లింగములయందు దు వర్ణకమును, బహువచనమున పుంలింగ స్త్రీలింగములందు రువర్ణకమును నపుంసకలింగమునందు వు వర్ణకమును జేరుటవలన వ్యతిరేక తద్ధర్మక మేర్పడును.

ఉదా:—పోషింపడు - పోషింపదు - పోషింపరు-పోషింపవు.

(చ) తుమున్నర్థక రూపము తుదను మధ్యమ పురుష ఏకవచన బహువచనములయందు క్రమముగావు రు వర్ణకములు చేరుటవలన వ్యతిరేక తద్ధర్మక మేర్పడును.

ఉదా:—పోషింపవు- పోషింపరు.

(ట) తుమున్నర్థకరూపముతుదను ఉత్తమపురుష ఏకవచన బహువచనములయందు క్రమముగాను, ము వర్ణకములు

చేరుటవలన వ్యతిరేక తద్ధర్మక మేర్పడును.

ఉదా:—పోషింపను-పోషింపము; కొట్టను-కొట్టము.

అసమాపకములు.

(1) క్త్వార్థకము (Past Part):—ధాతువుకొనయందలి ఉకారము ఇకారమగుటవలన నేర్పడును.

ఉదా:—పోషించి, కొట్టి.

1. ఇకారము పరమగునపుడు యకారాంత ధాతువుల యకారమునకు సకారమగును. ఎ, కొను పరమగునపుడు సహితము సకారమగును.

ఉదా:—చేసిరి, చేసెను, చేసెడిన్, చేసికొను.

2. వ్యతిరేక క్త్వార్థకము (Negative):—తుమున్నర్థక రూపము తుదను కవర్ణము చేర్చుటవలన నగును. అప్పుడు ద్రుతము లోపించును.

ఉదా:—పోషింపక, కొట్టక.

3. తుమున్నాద్యర్థకము (Infinitive Mood):— ధాతువు తుదను ద్రుతసహితమగు అకారము చేర్చుటచే నగును.

ఉదా:—పోషింపన్, కొట్టన్.

4. శత్రర్థకము:—ధాతువు కొనను ద్రుతసహిత చువర్ణము చేర్చుటచే నగును.

ఉదా:—పోషింపుచున్, కొట్టుచున్.

5. అనంతర్యార్థకము:—(Contiguous mood) ధాతువుకొనను ద్రుతసహితమగు డు వర్ణము చేర్చుటచే నగును.

ఉదా:—పోషింపుచుఁ, కొట్టుచున్.

6. చేదాద్యర్థము (Subjunctive mood):—క్త్వార్థకరూపము తుదను ద్రుతసహిత నవర్ణము చేర్చుటచే నగును.

ఉదా:—పోషించినఁ, కొట్టినఁ.

6. విశేషణరూపములు -Participial Adjectives.

విశేషణరూపములు—1. వర్తమానార్థక విశేషణము :— శత్రర్థకరూపము తుదను ఉన్న అనునది చేర్చుట వలన కలుగును.

ఉదా:—పోషింపుచున్న, కొట్టుచున్న.

2. భూతార్థక విశేషణము:— క్త్వార్థకరూపము తుదను న వర్ణకము చేర్చుటచే నగును.

ఉదా:—పోషించిన, కొట్టిన.

3. భవిష్యదర్థక విశేషణము:— తుమున్నర్థకము తుదను కల యనునది చేర్చుటవలన నేర్పడును.

ఉదా:—పోషింపఁగల - కొట్టఁగల.

4. తద్ధర్మార్థక విశేషణము:—ధాతువు తుదను ఎడు డి వర్ణకములు వైకల్పికముగ చేర్చుటవలన నేర్పడును.

ఉదా:—పోషించెడు-కొట్టెడి.

5. వ్యతిరేకార్థక విశేషణము:— తుమున్నర్థక రూపము తుదను ని వర్ణకము జేర్చుటవలన నగును.

ఉదా:—పోషింపని-కొట్టని.

2. విశేష్యములు:—1. ధాత్వర్థము:— ధాతువు తుదను టవర్ణము చేర్చుటచేనగును.

ఉదా:—పోషించుట, కొట్టుట.

2. వ్యతిరేకధాత్వర్థకము:— తుమున్నర్థకరూపము తుదను మి చేర్చుటచే నగును.

ఉదా:—పోషింపమి, కొట్టమి.

3. కృదంతములు:—(Verbal nouns) 1. ధాతువులతుదను కొన్ని ప్రత్యయములు చేర్చుటవలన నగును.

ఉదా:—ఎలిక (ఏలు) కలిమి (కలుగు) కొనుబడి (కొను)

4. ప్రేరణార్థకము:—మఱియొకనిచేఁ జయించునది.

ఉదా:—పోషింపించు, కొట్టించు.

ధాతువునకించు ప్రత్యయముచేర్చుటచేఁ బ్రేరణార్థక మేర్పడును.

ఉదా:—పోషించు, కొట్టించు, చేయించు.

క్రియలు:— 1 సాధారణక్రియలు 2 నిపాతక్రియలు అని రెండువిధములు.

1 ధాతువు తుదను ద్రుతసహిత అకారమును ము; డు వర్ణకములును జేర్చుటవలనఁ గ్రమముగా తుమున్నాద్యర్థకమును, ప్రార్థనార్థకమును నేర్పడునవి. సాధారణ క్రియలు (Regular verbs).

| ధాతువు | తుమున్నాద్యర్థకము | ప్రార్థనార్థకము. |
|---|---|---|
| పోషించు | పోషింపన్ | పోషింపుము, పోషింపుఁడు |

భరించు భరింపన్ భరింపుము, భరింపుఁడు.

2 నిపాతక్రియలు (Irregular verbs) తుమున్నార్థక ముందును ప్రార్థనార్థకమందును వేఱు రూపములనుపొందునవి. ఉదా:—

| ధాతువు | తుమున్నాద్యర్థ్యకము | ప్రార్థనార్థకము |
| --- | --- | --- |
| అగు | కాన్ | కమ్ము, కలఁడు |
| వచ్చు | రాన్ | రమ్ము, రండు. |
| చొచ్చు | చొరన్ | చొరుము, చొరుఁడు |
| ఇచ్చు | ఈన్, ఈయన్ | ఇయ్యన్, ఇమ్ము,ఇండు |
| నొచ్చు | నోన్,నోవన్,నొవ్వన్, | నొవ్వుము,నొవ్వఁడు |
| కను | కనన్, కానన్ | కనుము, కనుఁడు. |
| పిలుచు | పిలువన్ | పిలుము, పిలుఁడు, పిలువుము, పిలువుఁడు. |

3 ప్రేరణార్థకము. 1 సమరూప క్రియలు 2 భిన్నరూప క్రియలని రెండువిధములు.

1. సమరూపక్రియలు:— ధాతువు తుదను ఇంచు చేర్చుట వలన నేర్పడునవి.

ఉదా:—(పోషించు) పోషింపించు, (కొట్టు) కొట్టించు.

2. భిన్నరూపక్రియలు:—పైరీతిని గాక వేరువేరు రూపములను చెందునవి.

ఉదా:—(రంజిల్లు) రంజించు - (అడఁగు) అడఁచు.

3. కొన్ని భిన్నరూప క్రియలు.

| స్వార్థము | ప్రేరణము. | స్వార్థకము | ప్రేరణము |
|---|---|---|---|
| పూను | పూనుచు, పూనించు | తేలు | తేలుచు- తేలించు |
| కుదురు | కుదురుచు, కుదిరించు | విను | వినుచు-వినిపించు |
| అను | అనిపించు | తిను | తినిపించు |
| కను | కనుపించు- కానిపించు | మెచ్చు | మెప్పించు, మెప్పించు. |
| మాను | మానుచు-మానుపు మానిపించుమానించు | వచ్చు<br>నొచ్చు | రావించు-రప్పించు<br>నొచ్చు-నొప్పించు |
| డిగు | డిగించు-డించు | తునుగు | త్రుంచు |
| మునుగు | మునుచు-ముంచు | కలుగు | కలయు-కలంచు |
| ఉడుగు | ఉడుపు-ఉడుగించు | రేగు | రేచు, రేపించు- రేపు |
| ఆగు | ఆచు-ఆపు-ఆగించు, [ఆగించు, | చొచ్చు | చొనపు, చొప్పించు |
| పాయు | పాచు-పాపు | చచ్చు | చంపు |
| నిలుచు | నిలువరించు-నిలుపు | కొను | కొలుపు |
| ఆడు | ఆడుచు ఆడించు | | |

## 7. శబ్దపల్లవములు.

శబ్దపల్లవములు:—ధాతువులతో ధాతువులుకలిసి వేఱువేఱు అర్థమును నొందునవి శబ్దపల్లవములు.

ఉదా:—కూరుచు + ఉండు=కూరుచుండు, మేలు + కను= మేలుకొను, మేలుకాంచు - తలపోయు - విజయం చేయు - వేంచేయు మొదలైనవి.

తత్సమధాతువులు:—1. అకారాంతములుగాని తత్సమ క్రియలలో లఘువగు నేకాక్షరము పూర్వమందుంగల ధాతువులకు ఇంచు పరమగుచో వికల్పముగవికారము వచ్చును.

ఉదా:—హార్ + ఇ + ఇంచు=హరియించు, హరించు.

2. సంస్కృతధాతువుల చివర వర్ణము హల్లయిన పూర్వ ఋకారమున కరాదేశంబగును.

ఉదా:—వృధ్ వర్ధ్ + ఇల్లు =వర్ధిల్లు; నృత్ నర్త్ + ఇంచు = నర్తించు.

3. తత్సమములగు సకర్మకక్రియలనుతుదిని యించు, యిల్లు ప్రత్యయములువచ్చును.

ఉదా:—ఘటిల్లు - శోభిల్లు - రంజిల్లు.

4. ధాతువు మొదటి వర్ణము గురువయ్యేని లకారమునకు ద్విత్వలోపము విభాషనగును.

ఉదా:—వర్ధిల్లు, వర్ధిలు; రంజిల్లు, రంజిలు.

9. అవ్యయములు;(Indiclinable words)

అవ్యయము:—లింగవచనవిభక్తులను పొందకుండునవి.

ఇవి (1) లాక్షణికములు. (2) వైకృతోక్తములు అని రెండువిధములు.

1. లాక్షణికము:-క్రియలవలనఁ బుట్టినవి.
ఉదా:—వండి, వండక, వండినన్, వండన్.
2. ప్రతిపదోక్తములు:—పుట్టినవి, పుట్టినట్లుండునవి.
ఉదా:—అకట, ఆహా.

10. సముచ్చయములు (Conjunctions):—

1. పదముల నొకదానితో నొకటి గలుపుప్రత్యయములు.
ఉదా:—యు, ను, [ఇవి మిశ్రాంతములు]
2. ఉకారాంతశబ్దములమీఁద ను వర్ణకమగును.
ఉదా:—రాముఁడును కృష్ణుఁడును వచ్చిరి.
3. తక్కినశబ్దములమీఁద యువర్ణకమగును.
ఉదా:—హరియు లక్ష్మియు వచ్చిరి.

# VII. కృత్తద్ధితరూపములు.

## (1) కృదంతములు (Verbal Nouns.)

(1) కృదంతములు:—క్రియలనుండి పుట్టు విశేష్యములు కృదంతము లనఁబడును.

1. ఎఱుఁగు మొదలగువానికి దుదను కవర్ణక మగును.
ఉదా:—ఎఱుక, తునుఁగు, తునుఁక, పోవు, పోక, పోలు, పోలిక, ఏలు, ఏలిక, కాగు, కాక, నడచు, నడక, మడఁచు, మడఁక, వీఁగు, వీఁక, మూఁగు, మూఁక, మలఁగు, మలఁక, కలఁగు, కలఁక, అలుగు, అలక, మొలచు, మొలక, కినియు, కినుక.

2. అణఁగుప్రభృతులకుఁ గువ అంతాదేశమగును.

ఉదా—అణఁగు, అణకువ, పెనఁగు, పెనకువ, మెలఁగు, మెలకువ.

3. కూరుచు ప్రభృతులకు ఇమి యాదేశమగును.

కూరుచు + ఇమి-కూరిమి-బలియు - బలిమి-నేరుచు-నేరిమి-వ్రేలుచు-వ్రేలిమి-ఒడ్డు-ఒడ్డిమి-తాలు-తాలిమి-బలియు-బలిమి.

5. చేయుమొదలగువాని యంత్యాక్షరమున కర్థబిందు పూర్వక తవర్ణమగును.

ఉదా:—చేయు, చేఁత, మేయు, కోయు, గీయు, నేయు, పూయు, అలయు, కూయు, వ్రేయు, తీయు, వ్రాయు, మ్రోయు, మాయు మొదలైనవి.

ఉదా:—చేయు, చేఁత.

5. ఆడుప్రభృతుల యంత్యాక్షరమునకు టవర్ణకమగును.

(ఆడు. ఊరు. తివురు. తేరు. త్రిమ్మరు. పండు. వండు. పాడు. మండు. వేసరు. వసరు. చెమరు.) ఇవి ఆడుప్రభృతులు.

6. కూడు మొదలగువానికి టము టమి. వర్ణకములగును.

ఉదా:—కూడు,కూటము, కూటమి; ఓడు, ఓటము, ఓటమి.

7. పడు మొదలగువాని యాదిస్వరమునకు దీర్ఘమును తర్వాతివర్ణములకు టవర్ణాదేశమును అగును.

ఉదా:—పడు, పాటు, పొడుచు, పోటు.

(పడు, చెడు, అడుచు, పొడుచు, కఱచు, వయిచు, ఏయు, ఓడు, వ్రేయు, మఱుఁగు, గీచు మొదలగునవి)

8. అడుచు ప్రభృతుల కంత్యమునందు వువర్ణమగును.

ఉదా:—తలఁచు, తలఁపు, వలచు, వలపు.

(తలఁచు, వలచు, పిలుచు, విడుచు, తోఁచు, ప్రేచు, విఱుగు, పెనుచు, పొలుచు, ఏఁచు, ఏచు, కాచు, మేయు, అడుచు, అఱచు, మెచ్చు, వాచు, వంగు, చూచు, రాచు, దాయు, ఊడుచు మొదలైనవి.)

9. ఆవులించు లోనగువానికి తవర్ణ మంత్యాదేశమగును.

(ఆవులించు సకిలించు ఇగిలించు ఒకరించు ఒకిరించు ఖుల్లగించు పెకలించు కొక్కరించు వెక్కరించు కొప్ప రించు గిలిగించు కౌఁగలించు పలుకరించు కలువరించు పలవించు మొదలైనవి.)

ఉదా:—కవుగలింత, ఆవలింత.

10. అరయు మొదలగు వానికి ఇక వర్ణకమగును.

(అరయు ఓపు కూడు ఓడు అమరు పొగడు కలయు కోరు పొందు పోలు తేలు చేరు నమ్ము చల్లు అల్లు తేరు బడలు అలయు మొదలైనవి.)

ఉదా:—ఓపు, ఓపిక; అరయు, అరయిక.

11. ఏలు ప్రభృతులకు బడు వర్ణకములగును.

(ఏలు కొను కను కిట్టు చెల్లు చేరు తగులు తీరు పెట్టు

మ్రొక్కు వచ్చు సాగు దిగు మొదలగునవి.

ఉదా:—ఏలుబడి, కొనుబడి, తీరుబడి, కిట్టుబడి.

12. పన్ను ప్రభృతులకు గడ ప్రత్యయములగు. (పన్ను మను చేరు తీరు తేరు పీడు మొదలైనవి.) తిరుగు విఱుఁగు తేగు ఆగు వీని కంత్యాక్షరలోప మగును.

ఉదా:— పన్నుగడ మనుగడ తీఱుగడ తిరుగడ ఆగడ తేగడ.

13. కొలుచు ప్రభృతుల యంత్యాక్షరమునకు వువర్ణక మగును. (కొలుచు పూచు నోచు నొచ్చు చచ్చు పుచ్చు తడయు నిలుచు మొదలైనవి.)

ఉదా:—కొలువు నిలువు నోవు చావు.

14. కుదురు ప్రభృతులకు వవర్ణమంత్యమం దాదేశమగును. (కుదురు కొదరు నిలుచు లోఁచు త్రోఁచు నడచు మొదలైనవి. కుదువ కొదవ నిలువ.

2. తద్ధితరూపములు. (Nominal Dirivates)

(2) తద్ధితములు:—విశేష్యములకును విశేషణములకును గొన్ని ప్రత్యయములు చేరి విశేషాభిప్రాయమును గూర్చునవి తద్ధిత ప్రత్యయము లనఁబడును.

ఉదా:—చెలికాఁడు—దొంగతనము—కన్నెఱికము.

1. చిన్నాదులకు భావార్థమున ఱికమగును.

ఉదా:—చిన్న + ఱికము - చిన్నఱికము - పేదఱికము. (చిన్న-పెద్ద-పేద-కన్నె-చుట్టము-రాచ-యివి చిన్నాదులు.)

2. దొరాదులకు భావార్థమున తనమగును.

(దొర-మగ-పెంకె-మంచి -దొంగ-పాఱుబోతు-మొదలైనవి దొరాదులు.)

ఉదా:—దొర + తనము = దొరతనము. మగ + తనము = మగతనము.

3. పేర్వాదులకు ఇమి యగును.

(పేరు-కడు-మేలు-వాడి-పోడి-చెలిమొదలైనవిపేర్వాదులు.)

ఉదా:—పేరు + ఇమి = పేరిమి, వాడి + ఇమి = వాడిమి,

4. అర మరాదులకు ఇకవర్ణకమగును.

(అరమర, మాన, నడవడి, ఆము, అల్లిబిల్లి, గండ, నివ్వాళి, పొత్తి, మెలి మొదలైనవి.)

ఉదా:—అరమర + ఇక = అరమరిక - నడవడి + ఇక = నడవడిక.

5. నెలతాదులకు వుకవర్ణకమగు.

(నెలఁత - మెలఁత -నిప్పు-విప్పు-చిఱుత-పొలఁతి-ఎమ్ము-పడఁతి నాతి మొదలైనవి.)

ఉదా:— నెలఁత + ఉక - నెలఁ తుక - చిఱుత + ఉక = చిఱుతుక.

6. వేఁటాదులకు పుం స్త్రీ లింగముల కాఁడు, కత్తెలగును.

(వేఁట సొగసు చెలి చెలిమి పోటు విలు వన్నె సీటు వగ మొదలైనవి వేఁటాదులు.)

ఉదా:—వేఁట + కాఁడు = వేఁటకాఁడు, వేఁట+కత్తె = వేఁటకత్తె.

7. జాలాదులకు భావార్థమందు అరివర్ణకమగును. అగుచో దుదివర్ణము లోపించును.

(జాలము - కల్ల - పోటు - తెరవు - వెరవు - తగవు - తెంపు - తీర్పు - నేర్పు - టక్కు - పొదుపు - కాపు - మేపు - ఎత్తు - పొడుగు - గడుసు మొ.)

ఉదా:—జాల + అరి = జాలరి; తెరవు + అరి = తెరవరి.

8. వగాదులకు బహువచనరూపములపై ఆఁడు, ఆఁడి వర్ణకములు వచ్చి పుం స్త్రీలింగములగును.

(వగ- చిన్నె - కులుకు - టక్కు - టెక్కు - మాయ - సొగసు - మొ)

ఉదా:—చిన్నెలు + ఆఁడు = చిన్నెలాఁడు, చిన్నెలాఁడి.

9. పరిమాణార్థమున ఎఁడు వర్ణకమగు.

ఉదా:—వీసెఁడు - గుప్పెఁడు.

10. ప్రమాణమును దెలుపుటకు బంటి కొలఁదు లగును.

ఉదా:—మోకాలిబంటి, శక్తికొలఁది.

11. కులవాచకములకు పుం స్త్రీ లింగముల వాఁడు, అది వర్ణకములగు.

ఉదా—బాపనవాఁడు - బాపనది - పల్లెవాఁడు- కోయది.

12. వినికి ప్రభృతులకు స్వార్థమందు ఇడివర్ణకమగును.
(వినికి - విరివి - రాపు - తెలివి - మొదలైనవి వినికి ప్రభృతులు.)

ఉదా:—వినికి + ఇడి = వినికిడి - తెలివి + ఇడి = తెలివిడి.

13. ముక్కు మొదలగువానికి లేమిని దెల్పునెడ ఇఁడి వర్ణకమగును.

ఉదా:—ముక్కిఁడి - వెరవిఁడి - సిగ్గిఁడి - వేతిఁడి.

14. ఒప్పుప్రభృతులకు స్వార్థమున ఇద మువర్ణకమగును.

ఉదా:—ఒప్పిదము - తప్పిదము - బెట్టిదము - పెల్లిదము.

## 3. ఆచ్ఛికములు.

(ఆచ్ఛికములన తత్సమములుకాని యాంధ్రపదములు.)

1. ఏకాదులుతప్ప తెనుఁగుపదములు స్త్రీ నపుంసక సమములగును.

(ఒకఁడు, వాఁడు, వీఁడు, ఎవఁడు, పాఱుఁడు, మగఁడు, చందురుఁడు, జముఁడు, మొదలైన పదములు ఏకాదులు).

ఉదా:—ఒల్ల, పిల్ల, గోరు, పేరు, పేను, బాలి, పైఁడి మొ॥

2. పుంలింగములగు మగాదులకును, కయిరాదులకును, బిందుపూర్వక డు వర్ణక మగును. కాని ఉకారముమాత్రము రాదు.

మగ, మనమ, రాయ, పాత, బాఁప, వేగ్రి, ఈ, కా, తే మొదలైనవి మగాదులు. కయిర, కత్తళ, జన్న, నీల,

కడవ, పులియ, కోట, జసవ మొదలైనవి కయిరాదులు.

ఉదా:—మగఁడు, కయిరఁడు.

3. నెట్టనాదులు స్త్రీ నపుంసక లింగసనములు.

ఉదా:—నెట్టన, నెట్టనము, అక్కటిక, అక్కటికము, అటమటము.

4. అకర్వాదుల వు వర్ణము వైకల్పికముగ లోపించును.

ఉదా:—అకరువు, అకరు, అత్తరువు, అత్తరు, పుట్టువు, పుట్టు.

5. నామాంతమందలి ఇ య కు మారుగా ఎత్వము బహుళముగ నగును.

ఉదా:—జన్నియ జన్నె, కన్నియ కన్నె, కొండియము కొండెము.

6. పదమునకు మొదటఁగాక ఇతర హల్లుతోఁ గలియక వుండు గకారమునకు వకారము విభాషనగును.

ఉదా:—వేసఁగి, వేసవి; తగులు, తవులు; పగలు, పవలు; అగు, అవు.

7. తెనుఁగుపదములందు చివరి రులు-డు-ల ముందటి యేకారము హ్రస్వము నగును.

ఉదా:—ఊయేల - ఊయెల - ఉయెల.

8. ళకారముక్రింది ళకారమునకును తుది ను లు ల క్రింది న ల ల కును లోపము విభాషనగును.

ఉదా: —అళ్లు-అళు-కళ్లు-కళు-గొళ్లియ-గొళియ-కన్ను-కను-దున్ను-దును-పల్లు-పలు-విల్లు-విలు-నన్ను-నను.

9. అక్కటాదుల జడ్డకు లోపము విభాష నగును.

ఉదా:— అక్కట- అట్టిక అట్టు-అక్కో-అయ్యా-అయ్యారే- అవ్వారి-ఇట్టిక-ఉప్పడము-ఉమ్మి - ఎక్కిసక్కియము- ఎక్కిరింత-ఎడ్డ-ఎన్నిక-ఎమ్మిక-కజ్జాయము-కట్టా-కట్టిక- కప్పా-కమ్మటము-కమ్మతము-కువ్వాడము-కొమ్మ-కొయ్యగూర-గయ్యాళము-గిజ్జిగాడు-గుజ్జరాతి-చిట్టి-చిన్న-చిమ్మట- చెన్నటి-చెప్పము-చెప్పడు-చెమ్మట-చెల్లి-జవ్వాది - జాబిల్లి-తమ్మటము-తమ్ములము-తల్లి-తువ్వర- తెల్ల-దవ్వు-దివ్వియ-నవ్వు-నిద్దుర-నివరి-నివ్వాళి - నువ్వు- నెట్టిక - నెమ్మలి - పవ్వళించు-పిన్న-పుల్లియ-పువ్వు-పెద్ద-పొట్టేలు - పెగ్గడ-బొమ్మ - మత్తాబు - మల్లారము - ముద్దియ-లొట్టిపిట్ట-వయ్యాళి-సివ్వంగి-అట్టు-ఇట్టు- మమ్ము-మిమ్ము - అన్న - అవ్వ -అచ్చటు మొదలైనవి.

10. హాదులు నీలుగు లోనగు వానికిని తొలి హల్లునకు లోపము విభాష నగును.

ఉదా:—హాడపము-అడపము-హారిదళము-అరిదళము-నీలుగు-ఈలుగు-నెగయు-ఎగయు-పొందు-ఒందు-పొనరు - ఒనరు-పూను-ఊను-పొదవు-ఒదవు-పంపు-అంపు.

11. ఆరాటాదులకు ప్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వమగును.

ఉదా:—ఆరాటము-ఆరటము-కక్కూఱితి- కక్కుఱితి- కేళాకూళి- కేళకూళి-కొమారుడు-కొమరుడు- గంబూరము

గంబురము - పెండారము - పెండరము - బంగారము - బంగరము - బేహారము-బేహరము మొద.

12. ఓ యారాదుల తొలిదీర్ఘమునకు హ్రస్వము వికల్పముగ నగును.

ఉదా:—ఓయారము, ఒయారము, కేళాకూళి - కెళాకుళి గోరువంక - గొరువంక. పేడ - పెడ. బేహారము - బెహారము మొదలైనవి.

13. అడంగ్వాదులకు ణ విభాషనగును.

ఉదా:—అడఁగు - అణఁగు. కడఁగు - కణఁగు. నాడెము నాణెము. పోడి - పోణి. మిడుఁగు - మిణుఁగు. వడఁకు- వణఁకు. మిడుఁగురు - మిణుఁగురు.

14. దక్కు లోనగువాని దకారమునకు డకారము విభాష నగును.

ఉదా:—దక్కు - డక్కు. దగ్గఱు - డగ్గఱు. దెప్పరము - డెప్పరము. దొంగ - డొంగ. దెందము - డెందము. దబ్బఱ - డబ్బర. దాయు - డాయు. దప్పి - డప్పి. దాపల - డాపల.

15. ఏతాదులకు మువర్ణమునకు ముందు హ్రస్వము, దీర్ఘము విభాషనగును.

ఉదా:—ఏతము - ఏతాము. కళ్ళము - కళ్ళాము. గాలము- గాలాము.

16. జూదాదుల దకారమునకు జకారము విభాషనగును.

ఉదా:—జూదము - జూజము. జవ్వాది - జవ్వాజి. విరవాది - విరవాజి.

17. కలన్వాదుల నువర్ణమునకు వైకల్పికముగా నర్ధబిందు పూర్వక కువర్ణము వచ్చును.

ఉదా:—కలను - కలఁకు. కొలను - కొలఁకు. ప్రమాను - మ్రాఁకు.

## VIII. కర్త, కర్మ, క్రియలు.

1 కర్త:—(Agent or Subject) క్రియకుఆశ్రయమగువాఁడు, పనిని చేయువాఁడు, చేయునదియు గర్తయనఁబడును.

ఉదా:—రాముఁడు నడచెను.

2 కర్మ:—(Object) క్రియయొక్క ఫలమును పొందునది.

ఉదా:—రాముఁడు లంకను జయించెను:

3 క్రియ:—(Verb జరుగు పని క్రియయనఁబడును.

ఉదా:—రాముఁడు పరువెత్తెను.

1 క్రియను తెలిసికొని ఎవఁడు ఏదియని ప్రశ్న వేయఁగా కర్త వచ్చును.

2 క్రియను దేనిని, దేనిని అని ప్రశ్న వేయఁగా కర్మవచ్చును.

### (1) ప్రయోగములు.

(1) వాక్య ప్రయోగము:—1 కర్త్రర్థక ప్రయోగము లేక, కర్తరి ప్రయోగము.

2 కర్మార్థక ప్రయోగము (లేక కర్మణిప్రయోగము) అని రెండువిధములు.

1 కర్త్రర్థకప్రయోగము (Active Voice) కర్త ప్రథమావిభక్తిగను, కర్మ ద్వితీయ విభక్తిగను నుండును.

ఉదా:—రాముఁడు రావణునిఁ జంపెను.

2 కర్మార్థక ప్రయోగము (Passive Voice):—కర్త తృతీయా విభక్తిగను, కర్మ ప్రథమావిభక్తిగనునుండి క్రియపై పడు ప్రత్యయమువచ్చును.

ఉదా:—రామునిచేత రావణుఁడు చంపఁబడెను.

(కర్త్రర్థక వాక్యములోని కర్తలను తృతీయావిభక్తిలోనికిని, కర్మను ప్రథమావిభక్తిలోనికిని మార్చినచో కర్మార్థక మేర్పడును)

(2) శబ్దరూప నిష్పత్తి.

1. పదము:—Word అర్థముగల యొకయక్షరముగాని కొన్ని యక్షరముల కూడికగాని పదము.

ఉదా:—రాజు, చంద్రుఁడు, కొండ.

2. వాక్యము. ( Sentence ) పూర్ణమైన యభిప్రాయమును దెలుపుపదముల సముదాయము వాక్యము.

ఉదా:—దేవుఁడు మనలను గాపాడును.

3. ఉపవాక్యము:—Clause. అసమాపక క్రియఁగల వాక్యము.

ఉదా:—దేవుఁడు మనలను కాపాడి.

4. సంపూర్ణవాక్యము:—Simple Sentence సమాపక క్రియగలవాక్యము. ఉదా:—నీవు సత్యమును పలుకుము.

5. అన్వయము:—వాక్యములోని పదములలోఁ బ్రతిపదమును వేరొకపదముతోఁ గలసి యన్వయించును.

శబ్దలక్షణము.

1. విశేష్యము (నామవాచకము) నకు శబ్దలక్షణము.

1. భాషాభాగము Part of Speech
2. అంతర్భాగము Sub-division
3. లింగము Gender.
4. విభక్తి Case
5. కళయా, దుత్రపత్రికృతికమా.

6. క్రియతోఁగల సంబంధము (Construction with the predicate.)

2. సర్వనామమునకు:—1. భాషాభాగము, (దేనికి బదులుగా వాడఁబడినది.)

3. క్రియకు శబ్దలక్షణము చేయురీతి.

1. భాషాభాగము (ధాతువు) 2. ఆచ్ఛికమా?తత్సమమా? 3.సహాయక్రియయా?స్వతంత్రక్రియయా?4.సమాపకమా? అసమాపకమా? 5. సకర్మకమా? అకర్మకమా? 6. సదర్థకమా? అసదర్థకమా? 7. కాలము. 8. పురుషము 9. వచ

నము.10. ప్రయోగము.11.పదము. 12.కళయా? ద్రుతప్రకృతిక మా?13.ఏధాతురూపము? 14.కర్తృకర్మలతోఁగల సంబంధము.

1. విశేషణమునకు:-1.భాషా భాగము2అంతర్భాగము3విధేయవిశేషమైన (1అర్థకము 2విభక్తి3వచనము)4.నామవిశేషణమైన 1. ఏక్రియాజన్య విశేషణము. 2. ఏసంఖ్యా విశేషణము, 3.మతవిశేషణము 4.స్థితి 5. దేనిగుణమును దెలుపుచున్నది 6. తత్సమాది భేదముల నిదియేది?

5. అవ్యయమునకు:—

1. ఏభాషాభాగము 2. తత్సమమా ? ఆచ్ఛికమా ?
3. ఏయంతర్భాగము? సముచ్చయమైన వేనిని గలుపుచున్నది?

ఉదా:—ఆచిన్నరాముఁడు నీతో మంచి మాటలను బలికెను.

రూ ప ని ష్ప త్తి.

అన్వయక్రమము—(Parsing)

1. అన్వయము:—ఏయేభాషాభాగములు వేనితోసంబధించునో యా విషయమును దెలిపెడిదాని కన్వయమని పేరు.

2. యొక్క తప్ప తక్కిన విభక్తులు క్రియతో నన్వయించును.

ఉదా:—నీవు నాతోఁ జెప్పితివి.

3. యొక్క యనునది పిమ్మటి విశేష్యముతో నన్వయించి క్రియను జెందును.

ఉదా:—కృష్ణునియొక్క గృపను గాంచితిని.

4. విశేషణములు విశేష్యములతోను, సర్వనామములతోను అన్వయించును.

ఉదా:—తెల్లని గుఱ్ఱము, యోగ్యుఁడగు రౌతు.

5. సర్వనామములు క్రియతో నన్వయించును.

ఉదా:—వాఁడు దానినిఁ జూచెను.

6. అవ్యయము క్రియతో నన్వయించును.

ఉదా—చూచి చనెను.

7. క్రియలు కర్తతో నన్వయించును.

ఉదా:—చూచెను కృష్ణుఁడు.

అన్వయక్రమమున కుదాహరణము.

ఒకవిద్యార్థి పాఠశాలకుఁ జని అచ్చటి పాఠములను మిగుల శ్రద్ధతో నేర్చెను.

ఒక:—సంఖ్యావాచకవిశేషణము,విద్యార్థియనువిశేష్యముతో నన్వయించును.

విద్యార్థి:—పుంలింగము, మహదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, కళ, నేర్చెను అను క్రియకుఁ గర్త.

పాఠశాలకున్:—విశేష్యము, అమహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, ద్రుతప్రకృతికము, చని యను నసమాపక క్రియతో నన్వయించును.

చని:—చనుధాతువు, అసమాపకము, భూతకాలము, సకర్మకము అను సమాపకమునకు నన్వయించును.

అచ్చటి:—అవ్యయము, విశేషణరూపము నొంది పాఠములు అను నామవాచకముతో నన్వయించును.

పాఠములను:—విశేష్యము, అమహదర్థకము, బహువచనము, ద్వితీయావిభక్తి, ద్రుతప్రకృతికము, నేర్చెను అను క్రియకు కర్మ.

శ్రద్ధతోఁ:—నామవాచకము, అమహదర్థకము, ఏకవచనము తృతీయావిభక్తి, ద్రుతప్రకృతికము, నేర్చెను అను క్రియతో నన్వయించును.

నేర్చెను:—నేర్చు ధాతువు, ప్రథమపురుష, ఏకవచనము, భూతకాలము, సకర్మకము, విద్యార్థియను కర్తతో నన్వయించును.

# IX. వ్యాసలేఖనమున వాక్యముల నిర్దిష్ట ప్రకారము కూర్చుట.

## Errors in Grammar and Syntax.

వ్యాసరచనమునందు గమనింపఁదగిన విషయము.

1. వస్తువర్ణనము, 2 భాష, 3 రచన, 4 గుణము, 5గుఱుతులు

1. వస్తువర్ణనము:— వ్యాసము వ్రాయవలయు వస్తువును గుఱించిన విషయముల నాలోచించి విషయమును బట్టి (పేరాలు) పరిచ్ఛేదములుగా విభాగించి వ్రాయవలయును

వస్తువును గురించిన విషయములు:—

1 వస్తువుయొక్క స్వరూపము, స్వభావము.

2 వస్తువుండు ప్రదేశము.

3 జాతిభేదములు.

4 అభివృద్ధినందు పద్ధతులు. (ప్రాణము గలదైన నాహారాదులు)

5 ఉపయోగములు లేదా నష్టములు.

6 ఇతర విషయములు.

2. భాష:—వ్యాకరణ విరుద్ధమైన శబ్దముల నుపయోగింపక సులభశైలిలో సరళాదేశాదిసంధులు, అరసున్నలు, బండిఱాలు మొదలగు వానిని పాటింపవలయును.

(అరసున్నలు వేయమరచినను తప్పులేదుగాని లేనిచోట వేయుట గొప్ప తప్పు. అట్లే రవర్ణమునకు మాఱు అవర్ణము వాడుటయు, సంధిచేయరానిచోట చేయుటయు, శళలను దుష్ప్రకృతికములు చేయుటయుఁగూడ తప్పే).

3.రచన:—నేఁటికాలఁపు విద్యార్థులింగ్లీషువాక్యములుకల్పించు పద్ధతి నాంధ్రమునఁ గల్పించుచుందురు. అటులగాక తెలుఁగు దేశములోని వాడుక చొప్పున వాక్యము గల్పించుటదగును.

సామాన్యమైన తప్పువాడుకలు. మంచివాడుక.

1. I have a book.

నేనొక పుస్తకముఁ గలిగియున్నాను —నాకొకపుస్తకము [గలదు.

2. Is he a man? వాఁడు మనుష్యుడాఁ?

వాఁడొకమనుష్యుఁడై యున్నాఁడా?-వాఁడుమనుష్యుఁడేనా?

3. It is called a cat. దానిని పిల్లియందురు.

అదియొక పిల్లియనిపిలువఁబడుచున్నది-దానికిపిల్లియని పేరు.

4. It was killed by the cat. - పిల్లిచే నది చంపఁ [బడెను.

పిల్లివలన నది చంపఁబడెను. పిల్లి దానిని చంపినది.

5. Bring me the book which -
was written by me. -

నావలనవ్రాయఁబడిన యాపుస్తకమును దెమ్ము. నేను వ్రాసినపుస్తకముఁ దెమ్ము.

ఇటులే గమనింపవలయును.

4. గణములు:—వ్యాసమునందు చక్కని విషయము గలుగు నట్లును వాడినమాటలను తిరుగవాడకుండను అసభ్యములు (అనఁగా గ్రామ్యములు లేకుండునట్లును చెవులకింపై మనోహరముగ నుండునట్లును అనవసర విస్తారత లేకుండు నట్లును గమనింపవలయును).

గుఱుతులు:—(పేరా) పరిచ్ఛేదము మొదలు పెటినపుడు కొంతవదలి పంక్తి బ్రారంభింప వలయును. పంక్తులు

సూటికను దస్తూరి యందముగను నుండవలయును.

వ్యాసరచనయం దుపయోగింపనగు గురుతులు.

1. పూర్ణవిరామము, లేక తిలకము (Fullstop or Period) .

వాక్యముయొక్క చివర నుంచవలయును.

ఉదా:—బాలుఁడు పాఠము చదివెను.

2. అపూర్ణ విరామము. (Colon) :

3. అర్ధవిరామము లేక శేషచిహ్నము (Semi-colon) ;

అర్ధము పూర్తిగాని వాక్యక్రియాంతముననుంచవలయును.

ఉదా:— వాఁడు పరధ్యానముతో వ్రాయుచున్నాఁడు; కాన తప్పుపడినది.

4. అల్పవిరామము లేక విశ్రాంతిచిహ్నము (Comma) ,

అర్థమునుబట్టి నిలుపఁదగు చోటుల నుంచవలయును.

ఉదా:— రాముఁ డరణ్యమునకుఁ బోఁగా, భరతుఁడు రాజ్యమేలెను.

5. ప్రశ్నార్థకము (Note of interrogation) ?

ప్రశ్నచేయు చోటుల నుంచవలయును.

ఉదా:—అందఱును క్షేమమా?

6. రాగచిహ్నము (Note of exclamation) !

ఆశ్చర్యము, దుఃఖము, కోపము, స్ఫురింపఁజేయుచోటుల వేయవలయును.

ఉదా:—దేవునిదైన యీ ప్రపంచగృహమున సూర్య చంద్రులు దీపములఁ బోలియున్నారుగదా !

7. ప్రమాణ (ఉద్ధరణ) చిహ్నము,(Sign of quotation)" "
సందర్భమునుబట్టి తీసుకొన్న లోకోక్తి మున్నగు వానికి వాడవలయును.

ఉదా:—ధర్మము జయప్రదమైనది. "యతోధర్మ స్తతోజయః" అని వినలేదా ?

8. ఆవరణములు లేక త్యాజ్యచిహ్నము. Brackets ( )
వాక్యములో చేరనట్టియు స్పష్టతకై చూపఁబడినట్టియు భాగములకు వాడవలయును.

ఉదా:—రాముఁడు (దశరథుని కొడుకు) పితృవాక్యపరిపాలన మొనర్చెను.

9. లోపచిహ్నము Dash —
విడువఁబడిన భాగమును దెల్పుటకు వాఁడబడును.

ఉదా:—రాముఁడు — చనియెను.

10. హంసపాదము. ×
విడువఁబడిన అక్షరములను, మాటలను పంక్తిపైన వ్రాయు నపుడు క్రిందను వాడవలయును.

లంకకు

ఉదా:—రాముఁడు సముద్రమునుదాటి చేరెను.
×

11. సామ్యచిహ్నము. =
సమానత్వమునందు వాడవలయును.

12. తారకము:—Star *
విశేషాంశములను దెలుపవలసివచ్చునప్పు డీగుర్తు నుపయోగించి పుట క్రిందవిషయము వివరించుటకు వాడవలెను.

## X. ఛందస్సు (Prosody.)

ఛందస్సు:— కావ్యముల కంగభూతములగు పద్యముల లక్షణములను దెలుపుదానికి ఛందశ్శాస్త్రమని పేరు.

కావ్యము:—గురులఘువుల కూడికచేనైన గణములును, గణములకూడికచేనైన పద్యపాదములును, పద్యముల సముదాయముచే కావ్యమును వెలయుచుండును.

1. గణములు:—1. లఘువులు (హ్రస్వాక్షరములు) 2. గురువులు (దీర్ఘాక్షరములు)

1 లఘువులు:—ఒకచిటిక వేసినంత కాలములోఁ బలుకునవి. దీర్ఘములుకాని యచ్చులు వానితోఁ గూడిన హల్లులు లఘువులు. లఘువునకు | గుర్తు. లఘువనఁగా నొకమాత్ర యందురు.

ఉదా:—దీర్ఘములు కాని అచ్చులు:—అ. ఇ. ఉ. ఋ. ఎ. ఒ.ఁ అనునవి.

దీర్ఘముకాని హల్లులు:—క. గి. ఘు. చృ. జె. టొ మొదలైనవి.

2. గురువు:—రెండు చిటికలు వేయునంత కాలములోఁ బలుకునవి 1.దీర్ఘములగు నచ్చులు 2.వానితోఁగూడిన హల్లులు 3. బిందువుతోడను, 4. విసర్గములతోఁ గూడను 5. పొల్లులతోడను కూడిన వర్ణములు 6. సంయుక్తములకు ముందున్న వర్ణములు గురువులు. గురువునకు ‿ అని గుర్తు (గురువనఁగా రెండు మాత్రలు) గ యందురు.

ఉదా:—1 దీర్ఘాచ్చులు:-ఆ ఈ ఊ ఋా ఏ ఐ ఓ ఔ అం ఆః.

దీర్ఘాచ్చులతోఁ గూడిన హల్లులు:—కా గీ ఫీ చూ పూ దే ధై పో మా పం వః.

పొల్లు:—ౘ న్ క్ ర్ మొదలైనవి.

సంయుక్తములకు ముందున్న వర్ణములు:-ర (క్త) అ(ప్రి) సు(స్థి) వి(శ్వ) వ (ర్య) ప(క్వ) మొదలైనవి.

రెండు లఘువులకు | లాయనియు, రెండు గురువులకు ‿ గాయనియు గుర్తులు గలవు.

గణము:_గురు లఘువులైన మూఁడేసి యక్షరములుగలది.

ఇవి 1. మగణము 2. భగణము 3. జగణము 4. సగణము 5. నగణము 6. యగణము 7. రగణము 8. తగణము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మూఁడు గురువులు:_1 | మగణము | U | U | U | శ్రీరామా |
| ఆది గురువు :_2 | భగణము | U | \| | \| | శ్రీహరి |
| మధ్య గురువు :_3 | జగణము | \| | U | \| | మురారి |
| అంత్య గురువు :_4 | సగణము | \| | \| | U | వరదా |
| మూఁడు లఘువులు:_5 | నగణము | \| | \| | \| | నృహరి |
| ఆది లఘువు :_6 | యగణము | \| | U | U | మురారీ |
| మధ్య లఘువు :_7 | రగణము | U | \| | U | శ్రీహరీ |
| అంత్య లఘువు :_8 | తగణము | U | U | \| | గోవింద |

సూత్రము:_శ్లో॥ ఆది, మధ్యావసానేషు । య,ర,తా,యాంతి లాఘవం । భ,జ, సాగౌరవంయాంతి । మ, నౌ, తుగురులాఘవే॥

2. ఉపగణము:-గురులఘువులైన రెండేసియక్షరములు గలది.

ఇవి 1 హగణము (గలము) 2. వ గణము (లగము)

గురువు, లఘువు:__1. హగణము (గలము) U | శౌరి

లఘువు, గురువు:__1. వ గణము (లగము) | U హరీ

1. మూఁడక్షరములపై లఘువున్నచో గణాక్షరములతో లము చేరును. అట్లే గురువున్నచో గము చేరును.

ఉదా:—తలము, తగము.

2. ఉపగణములలో (1) సూర్యగణములు, (2) ఇంద్రగణములు ముఖ్యములు.

| | |      ‿ |

1. సూర్యగణములు:—(1) న గణము (2) హ గణము (గలము)

ఉదా:—1. నృహరి, 2. శౌరి.

2. ఇంద్రగణములు:—1. నలము, 2. నగము, 3. సలము 4. భగణము, 5. రగణము, 6. తగణము.

ఉదా:—1. నలము:—నగణమును లఘువును | | | | నరసఖ
2. నగము:—నగణము గురువును | | | ‿ నరసఖా
3. సలము:—సగణము లఘువును | | ‿ | గురునాథ
4. భగణము:-గురువు రెండులఘువులు ‿ | | శ్రీహరి
5. రగణము:—గురువు లఘువు గురువు ‿ | ‿ శ్రీహరీ
6. తగణము:—రెండుగురువులు లఘువు ‿ ‿ | గోవింద

1. యతి:—పద్యపాదముయొక్క మొదటివర్ణము. దీనికి విశ్రాంతి, విరతి, విశ్రమము మొదలగు పేర్లు గలవు. దీనికి స్వరము ప్రధానము. నిర్ణయమైన స్థానమున నా యక్షరమేగాని లేదా దానికి మైత్రిగల మఱియొకవర్ణము గాని నిలుపవలయును.

2. యతిమైత్రి:—1. అచ్చులు:-అ. ఆ. ఐ. ఔ. అం. అః. ా ౖ, ై, ౌ ం. ః

ఇ. ఈ. ఎ. ఏ. ఋ. ౠ. ి ీ . ె ే ృ ౄ

ఉ. ఊ. ఒ. ఓ. ు ూ. ొ ో

2. హల్లులు:_క. ఖ. గ. ఘ.
చ. చ. ఛ. జ. జ. ఝ. శ. ష. స. } క్ష యనువర్ణ మీ రెండు తెగల వర్ణములకును జెల్లును.

ట. ఠ. డ. ఢ.

త. థ. ద. ధ.

ప. ఫ. బ. భ. వ.

పు. ఫు. బు. భు. ము.

ంమ. ంప. ంఫ. ంబ. ంభ.

న. ణ.

ర. ఱ.

ల. ళ.

య. అ. యా. హ.

ప్రతి తెగయు దమలోఁ దాము యతిమైత్రిని జెందును.

ప్రాస:__పద్యపాదమందలి రెండవ యక్షరము.

1. ప్రాస మేయచ్చుతోఁ గూడియున్నను బనికి వచ్చును. కాని హల్లు మారరాదు. దీర్ఘాక్షరమైనను లేక హ్రస్వాక్షరమైనను లేక సంయుక్తాక్షరమైనను నట్లే తక్కిన పాదములయందుండవలయును. తనకు పూర్వవర్ణమైన యతి సర్వత్రగురువుగానైన లఘువుగానైన నుండవలయును.

ప ద్య ము లు .

పద్యములు:__యతి ప్రాసములతోఁ గూడిన నాలుగు పాదములు గలిగి యుండవలయును.

ఇవి 1. వృత్తములు, 2. జాతులు, 3 ఉపజాతులని మూఁడు విధములు.

1. వృత్తములు:— మూఁడక్షరములుగల గణములతో నేర్పడి యక్షర నియమముఁ గలిగియుండవలయును.

ఇవి 1. ఉత్పలమాల, 2. చంపకమాల, 3. శార్దూలము 4. మత్తేభము మొదలైనవి.

1. ఉత్పలమాల:— భ. ర. న. భ. భ. ర. వ గణములును పదియవ యక్షరము యతిస్థానమునుగల నాలుగు పాదములు గలది.

ఉదా:—

భ ర న భ భ ర వ (లగము)

U I I, U I U, I I I, U I I, U I I, U I U, I U.

ఉ. కొండని, వేడ్కతోఁ,బసిఁడి,కొండధ,నార్థుల, కెల్లబం,చియీ కుండుటదానధారకుఁ బయోనిధులెల్ల స్రవయింపలేమి యీ

2. చంపకమాల:— న. జ. భ. జ. జ. జ. ర. గణములును పదునొకండవ యక్షరము యతిస్థానమును గల నాలుగు పాదములు గలది.

ఉదా:—

న జ భ జ జ జ ర

I I I, I U I, U I I, I U I, I U I, I U I, U I U

చం. చెలువ,ముసెల్లఁ,బ్రోవుగ,నుజేసి,ప్రవీణ,తనంబు, జంబులన్ నలువ సృజింపరేల వికసద్యుతి హీనము కాట గ్రమ్మఱం

3. శార్దూలము:—మ. స. జ. స. త. త. గ. గణములునుపద మూఁడింట యతిస్థానమునుగల నాల్గుపాదములుగలది.

మ స జ స త త గ

ఉదా:—UUU,|| U,| U|,||U, UU|,UU|,U

శా. శ్రీరామా,రఘునం,దనార, ఘుపతీ,సీతామ,నోనాయ,కా మారాకార సమస్తలోకను శుంభద్దైత్యనాశంకరా.

4. మత్తేభము:—స భ ర న మ య (లగము)వగణములును పదునాల్గవ యక్షరము యతిస్థానమును గల నాలుగుపాదములు గలది.

ఉదా:—స భ ర న మ య వ

||U, U||, U|U,|||, UUU,|UU,|U

[లగము.]

మ. రజనీ, నాథకు, లైకభూ, షణుఁడ, వైరాజ,ర్షి వైధా,రుణీ ప్రజనెల్లన్ ప్రజవోలెధర్మనియతిన్ బాలింపుచున్ దొంటిధర్

(2) జాతులు.

2. జాతులు:—1 కందపద్యము మొదలైనవి. కందమునకు ప్రథమ తృతీయపాదములు మూఁడేసి గణములును, ద్వితీయచతుర్థపాదములు ఐదేసిగణములును నుండవలయును. గగము, భగణము, జగణము, సగణము, నలము ఈగణములేయుండవలయును. బేసిగణములందు జగణముండరాదు. నాల్గవగణము మొదటి యక్షరము

నకు, నేడవ గణము మొదటి యక్షరమునకు యతిమై
త్రియుండవలయును. రెండు నాలుగుపాదముల చివర
గురువులుండవలయును.

ఉదా:—అకలుష, నీలిమ, గాక,
న్యకచమునకు నోడినవిమైత్రేటుల్
మకరందారము తెలుచుగ
వికచములగు పుష్పములకె, వెదకుచు, నేగున్.

3. ఉపజాతులు.

3 ఉపజాతులు:—1 తేటగీతి,2 ఆటవెలఁది, 3 సీసము.

1 తేటగీతి:—ప్రతిపాదమునకు మొదట నొకసూర్యగణము, పిమ్మట రెండింద్రగణములు, ఆపైని రెండు సూర్యగణములు నుండవలయును. ప్రథమ చతుర్థగణములందు యతియేని ప్రాసయతియేని యుపయోగింపవచ్చును.

ఉదా:—అమ్మ, హాపూజ, కొనసాగి, నట్టులైన
మోక్ష, సామ్రాజ్య, మొనగూడు, నాక్షణంబ॥

2 ఆట వెలది:—ప్రథమ, తృతీయ పాదములయందు మొదట మూఁడు సూర్యగణములు, పిమ్మట రెండు ఇంద్రగణములును ద్వితీయ చతుర్థ పాదములయందైదేసి సూర్యగణములుండవలయును. ప్రతిపాదమునకు నాల్గవగణమునందు యతియైన ప్రాసయతియైన నుండవలయును.

ఉదా:-మొనసి- దనుజ- యోధ- ముఖ్యులు-నిగిడించు-శస్త్ర-సముద-యముల-జనవరేణ్యు.

3. సీసము:—ఒక్కొక్క పాదమున కాఱింద్రగణములు, రెండు సూర్యగణములు నుండవలయును. ప్రథమ తృతీయ గణములకును అయిదవ యేడవగణములకును యతిగాని ప్రాస యతిగాని యుండవలయును. ఇట్లు నాలుగు చరణము లుండి యనంతరము తేటగీతిగాని, ఆటవెలదిగాని యుండవలెను.

ఉదా:—సత్యని, త్ర్యుండవు, సతినింతి, వంచించి, దానివ, ప్రార్థంబు, దఱిగి, నీకు.

1. ఉత్పలమాలయొక్క పాదములందలి మొదటిగురువును రెండు లఘువులుగా నొనర్చిన చంపకమాలయగును.

ఉదా:—ఉ॥ నావుడు వారలెల్లను ఘనంబగు పద్ధతియంచు మెచ్చిరీ.

చం॥ అనవుడువారలెల్లను జయంబగు పద్ధతియంచుమెచ్చిరీ

2. శార్దూలముయొక్క పాదములందలి మొదటి గురువును రెండు లఘువులనుగా మార్చిన మత్తేభమగును.

ఉదా:—శా॥ ఔరా మేటిపరాక్రమ క్రమము భావ్యంబౌనె శాంతంబురా.

మ॥ అవురా మేటిపరాక్రమ క్రమము భావ్యంబౌనె శాంతంబురా.

3. కందపద్యము గురువునకు రెండులఘువులుగాఁ జేసి లెక్కించిన అరువదినాలుగు లఘువులుగా నుండును. నాలుగేసి లఘువుల నొక్కొక్కగణముక్రిందను లెక్కించిన గణముల సులభముగాఁ దెలిసికొనవచ్చును.

---

## XI. కావ్యప్రకరణము.

కావ్యములు:—అలంకార సహితములును, దోషరహితములు నగు వాక్యసమూహముతో నొప్పునది కావ్యము.

కావ్యములు:—1. 1. పద్యకావ్యము, 2. వచనకావ్యము అని రెండు విధములు.

1. పద్యకావ్యము:— ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన పద్యములతోడను, అందందు చిన్న చిన్న వచనములతో డను వెలయునది.

ఉదా:—పారుజాతాపహరణము, విజయ విలాసము.

2. వచనకావ్యము:—వచనముతోఁ గూడి వెలయునది.

ఉదా:—వచనభారతము.

అలంకారము:- చమత్కారము నొదవించు రసముతోగూడిన శబ్దార్థధర్మము అలంకార మనఁబడును.

ఇది 1. శబ్దాలంకారము 2. అర్థాలంకారము అని రెండు విధములు.

1. శబ్దాలంకారము(Word Rythym):—శబ్దమును అర్థము విచారింపక శ్రావ్యములైనది.

ఇది 1. అనుప్రాసము. 2. యమకము, 3. ముక్తపదగ్రస్తము మొదలైన భేదములు గలిగియుండును.

1. అనుప్రాసము:— మున్నుగొన్న వర్ణమునే పలుమాఱు నుడివిన అనుప్రాసమేర్పడును.

ఉదా:—చరణానత శరణాగత భరణాతత కరుణాలయ.

2. యమకము:—వాడిన శబ్దమునే అర్థభేదముచే మఱల మఱల నుడివిన యమక మేర్పడును.

ఉదా:—మముఁ గనికరంబునఁ గనికరంబున గరంబు గరంబు దట్టి యిట్లనియె.

3. ముక్తపదగ్రస్తము:— విడిచిన శబ్దభాగమును తిరిగి నుడివిన నేర్పడును. ఉదా:—సుదతీ నూతనమదనా మదనాగ తురంగ.

అర్థాలంకారములు (Figures of speech):-అర్థము ప్రధానమై కావ్యమునకు శోభ దెచ్చునవి.

ఇవి 1. ఉపమాలంకారము 2.రూపకాలంకారము 3.ఉత్ప్రేక్షాలంకారము 4. అతిశయోక్త్యలంకాలము 5. ఆక్షేపాలంకారము 6. వ్యతిరేకాలంకారము 7. సమాసోక్త్యలంకారము 8. తుల్యయోగితాలంకారము 9. దృష్టాంతాలంకారము 10. అర్థాంతరన్యాసాలంకారము 11. శ్లేషాలంకారము 12. కావ్యలింగాలంకారము మొదలైన భేదములతో నొప్పును.

1. ఉపమాలంకారము (Simile):- (లేక పూర్ణోపమ) రెండు పదార్థములయందు మనోహరమగు సామ్యము గలిగినచో నుపమాలంకారమనఁబడును:—1. ఉపమానము, 2. ఉపమేయము, 3. సాధారణధర్మము, 4. ఉపమావాచకము. అను నాల్గు భాగములును గలిగినచో పూర్ణోపమ యనఁబడును.

ఉదా:—ఈముఖము చంద్రునివలె మనోహరముగ నున్నది.

1. ఉపమానము:—చంద్రుఁడు (పోల్పఁదగినది)

2. ఉపమేయము: —ముఖము (పోల్పఁబడునది)

3. సాధారణధర్మము:—మనోహరము (ఉపమానోపమేయములకు సామాన్యగుణము)

4. ఉపమావాచకము:—పోలె, వలె (పోలికనుసూచించువలె మొదలైనవి.)

లుప్తోపమ:- ఉపమానోపమేయ సాధారణధర్మవాచకములలో నేదేని లోపించినచో లుప్తోపమ యనఁబడును.

ఉదా:—ముఖము చంద్రునివలెనున్నది.

2. రూపకము(Allegory):—ఉపమేయముయొక్క ధర్మము ఉపమానమునం దారోపింపఁబడి హృదయరంజకము గలిగినచో రూపకాలంకారమగును.

ఉదా:—ముఖమను పద్మముఁ జూచి యాశ్రిత మరాళములానందించుచున్నవి.

3. ఉత్ప్రేక్ష (Metaphor):—ఒకదానిని మరొకదానినిగా నూహించి చెప్పుటయే ఉత్ప్రేక్షాలంకారమగును. ఇందు (వస్తువుగానిది వస్తువుగాను, హేతువుగానిది హేతువుగాను) ఫలముకానిది ఫలముగాను తలపఁబడును.

ఉదా:—హిమాలయము పూర్వ పశ్చిమ సముద్రములకుఁ గొలకఱ్ఱవలె వెలయుచున్నది.

4. అతిశయోక్తి (Hyperbole) :—ఉన్నదానికంటె నెక్కువగాఁ జెప్పుట యతిశయోక్త్యలంకార మనఁబడును.

ఉదా:—ఆ మేడలు చుక్కల నంటుచున్నవి.

5. ఆక్షేపము:—ఇతరుఁడు చేయుకార్యము నాక్షేపించి తన యభీష్టము నాటఁ జెప్పుటను ఆక్షేపాలంకార మనఁబడును.

ఉదా:—ఓ ప్రాణనాయకా! వదలిపోవుచున్నావుగదా ! నా జన్మమున యుద్దేశ్య దేశంబుననే గలుగుఁగాక.

6. వ్యతిరేకము:—విరుద్ధార్థమగుపడునట్లుఁ జెప్పియర్థాంతరమున నట్టి వ్యతిరేకము లేకుండునట్లు వర్ణించుట వ్యతిరేకాలంకార మనఁబడును.

ఉదా:— సూర్యుఁడు తమోనాశకుఁడయ్యును, తమోగ్రస్తుఁడగుచున్నాఁడు.

7. సమాసోక్తి:— ప్రకృతి వస్తువుయొక్క విశేషణ సామ్యముచే నప్రకృత వస్తువు గమ్యమానమైనచో సమాసోక్త్యాలంకార మనఁబడును.

ఉదా:—ఓ రాజా! నీ శత్రుభార్య లడవులం బరచుచుండ దీవలు కోయిల పలుకులచేఁ బిల్చి మా పండ్ల భుజింపుఁడని పాదములపై నొరఁగుచున్నవి.

8. తుల్యయోగిత:— అప్రస్తుతములకుఁగాని ప్రస్తుతములకుఁగాని యేక ధర్మాభిసంబంధ ముండునట్లు వర్ణించినచో నది తుల్యయోగితాలంకార మనఁబడును.

9. దృష్టాంతము:— సమానధర్మము రెండు వాక్యములలోన సమానోపమేయ భావముచేఁ జెప్పఁబడినచో నది దృష్టాంతాలంకార మనఁబడును.

ఉదా.— పరిమళము నాఘ్రాణింపకున్నను మాలతీపుష్పమాలిక నేత్రపర్వమగును.

10. అర్థాంతరన్యాసము:—ఒక వాక్యార్థమును సమర్థించుటకై సామాన్యముగాఁగాని విశేషముగాఁగాని మఱియొక వాక్యమును జెప్పిన నర్థాంతరన్యాసాలంకార మనఁబడును.

ఉదా:— 1. రావణుఁడు సీత నపహరించి చెడిపోయెను. దుష్కృత్యము కీడును గలిగించునుగదా! 2. వెలలేని రతనములచే నొప్పు హిమవంతుని హిమము శోభాహాని చేయలేదు.

11. శ్లేష:— సమానబలమున ననేకార్థములు గలిగియుండిన శ్లేషాలంకార మనఁబడును.

ఉదా:—ఉచ్చతరులచేనొప్పుమీరుచు మంజులతలచేమించు కొమ్మల కాకరంబగు నప్పురం బారామంబు కడు నొప్పుమీరు. అంధకక్షయకరుఁ డుమానాథుఁడు మమ్ము నేలుఁగాక.

12. కావ్యలింగము:—సార్థకమైనకారణవాక్యముచే కార్యము నిరూపించి చెప్పుట కావ్యలింగాలంకారమనఁబడును.

ఉదా:—ఓమన్మథజడుఁడా ! నావలనఁ బరాజయమునొందితివి గదా ! ఎట్లులన నా చిత్తమున ముక్కంటిగలఁడుగాన.

సంపూర్ణము

---



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPWA102B187 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 153 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C, B, 132 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |